విషయసూచిక

అమిత దయాళువయిన అల్లాహ్ పేరుతో

# తొలిపలుకు

చాలా కాలంగా మన సంస్థను పూర్తి విద్యార్థి సంస్థగా (Student Orientation) రూపొందించే ప్రయత్నం జరుగుతూనే ఉంది. ఈ విషయమై విద్యాలయాలలో (కాలేజీలలో) పనిచేసేందుకై స్పష్టమైన మార్గదర్శకత్వాన్నందించే ఒక పుస్తకం ఎంతో అవసరమని భావించేవాళ్ళం. అయితే మిత్రులు బ్రాదర్ సఆదత్ హుసైనీ తన అనుభవాలన్నింటికి సృజనాత్మకతను (Creative Thinking) జతచేసి ఆ అవసరాన్ని తీర్చే కృషిచేశారు. ఈ పుస్తకం ఉర్దూలో 'క్యాంపస్ గైడ్' పేరుతో SIP ద్వారా ముద్రించబడింది.

మన ఆంధ్ర రాష్ట్రంలో దయామయుడైన అల్లాహ్ అనుగ్రహంతో అనేక విద్యాలయాలలో సంస్థ పని ప్రారంభించబడింది. అయితే రాష్ట్రంలోని అన్ని విద్యాలయాల్లోనూ సంస్థ స్థాపన (Penetration) జరగాలన్న లక్ష్యంతో అందుకు ఎంతగానో దోహదపడే క్యాంపస్ గైడ్‌ను తెలుగులో అనువదించడం జరిగింది.

ఈ పుస్తకానికి ఎన్నో ప్రత్యేకతలున్నాయి. ఇందులో రచయిత ఆచరణాత్మక అంశాలపై, వాటి విధానాలపై చక్కగా చర్చించారు. ముఖ్యంగా విద్యాలయాల్లో ప్రారంభ దశలో పని ఎలా చేయాలన్న అంశంతో పాటు సంస్థ పని పటిష్టమై ఉన్న కాలేజీలలో కార్యక్రమాలను ఇంకా ప్రభావవంతంగా ఎలా నిర్వహించాలన్న అంశాన్ని కూడా ఆయన సమగ్రంగా సమీక్షించారు. అలాగే క్యాంపస్‌లో పని యొక్క ప్రాముఖ్యతను, దాని అవసరాన్ని గురించి వివరిస్తూనే పనిచేస్తున్నప్పుడు ఎలాంటి సమస్యలెదురవుతాయి? వాటినెలా పరిష్కరించుకోవాలి?? అనే వివిధ విషయాలను విపులంగా విశదీకరించారు. ఈ పుస్తకంలో ఉన్న' ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్' అనే శీర్షిక కాలేజీల్లో చదువుతున్న మన సంస్థ సంబంధీకులకు చక్కని మార్గదర్శక సూత్రాలనందిస్తున్నది. కేవలం విద్యార్థులే ఈ పుస్తక సంబోధకులు కాదు. సంస్థకు చెందిన విభిన్న విభాగాల బాధ్యులకు కూడా ఈ పుస్తకం మార్గదర్శకత్వాన్నందిస్తోంది. ఇలా ఎన్నో ప్రత్యేకతలను తనలో ఇముడ్చుకున్న క్యాంపస్ గైడ్ యొక్క విశాలతను, విశిష్టతను కేవలం ఒక్క పేజీలో విశ్లేషించడం సాధ్యం

కాదు. పుస్తక అనువాదకులు సోదరులు ముహమ్మద్ జీలాని (ఏలూరు) ఈ పుస్తకాన్ని ఎంతో ఆసక్తితో సులభమైన, చక్కని తెలుగు భాషలో అనువదించారు. వారికి మా అభినందనలు. ఈ పుస్తకం చివరలో విద్యావిషయిక సమాచారాన్నందించే అనేక అంశాలు 'అనుబంధాల' రూపంలో పొందు పరచబడ్డాయి. వాటిద్వారా ఎనలేని ప్రయోజనం పొందవచ్చు. గమనించండి.

మిత్రులారా!

పుస్తకం మీ చేతుల్లో వుంది. కార్యరంగం మీ ముందు సిద్ధంగా వుంది. నేడు విద్యాలయాలలో నెలకొని ఉన్న కలుషిత వాతావరణాన్ని దూరం చేసి వాటి స్థానే నైతికతా పరిమళాలను వెదజల్లే కుసుమాలను వికసింపజేసేందుకై ఉద్యమించండి. విద్యాలయాలు మిమ్మల్ని పిలుస్తున్నాయి. ఇది విశ్వప్రభువైన అల్లాహ్ మనపై మోపిన బృహత్తర బాధ్యత. ఈ బాధ్యతను నిర్వర్తించేందుకై మనం చేసే కృషి, పరిశ్రమ వేరెవరికోసమో కాదు. దైవప్రసన్నత కోసమే. మన ఇహపరాల సాఫల్యాల కోసమే.

తెలుగు లోకానికి చెందిన మన సంస్థ సంబంధీకులు ఈ పుస్తకాన్ని అధ్యయనం చేస్తారని, దాని వెలుగులో విద్యాలయాలలో సంస్థ స్థాపనకు కృషి సలుపుతారని ఆశిస్తున్నాను. ఈ పుస్తక ప్రచురణలో సహాయ సహకారాలందించిన వారందరికీ ఉత్తమ ప్రతిఫలాన్ని అల్లాహ్ ప్రసాదించుగాక! ఆమీన్.

అల్లాహ్ మనందరికి యుక్తీ వివేకాలను, ఆయన మార్గంలో శ్రమించే, కృషి చేసే సద్బుద్ధిని ప్రసాదించి విజయపథంలో నడిపించాలని ప్రార్థిస్తూ.... (ఆమీన్)

**27-6-2005** **- సయ్యిద్ తన్వీరుల్ హాఖ్**

**హైదరాబాద్** రాష్ట్ర అధ్యక్షులు

**ఎస్.ఐ.ఓ. ఆంధ్రప్రదేశ్ జోన్**

అనంత కరుణామయుడైన అల్లాహ్ పేరుతో

## నా మాట

ఎంతో కాలంగా విద్యాలయాల్లో పనిచేసేందుకు స్పష్టమైన మార్గదర్శకత్వాన్ని అందించే క్యాంపస్ గైడ్ నొకదానిని తయారు చేయవలసిన అవసరముందని భావిస్తూ ఉండేవాళ్ళం. ఈ పర్యాయం రూపొందించబడిన మన కేంద్రస్థాయి పాలసీ ప్రోగ్రాములో కూడా ఇటువంటి గైడ్‌ను ప్రచురించాలనే నిర్ణయం తీసుకోబడింది.

ప్రస్తుతం విద్యాసంస్థలో విద్యనభ్యసిస్తున్న వ్యక్తే ఈ గైడ్‌ను రాయాలనేది నా అభిలాష. ఎందుకంటే అతడి అనుభవాలు ఎంతో తాజాగా ఉంటాయి కాబట్టి. కానీ ఆచరణాత్మకంగా అది సాధ్యపడలేదు. నేనే రాయవలసి వచ్చింది. వివిధ వయస్సులు గల విద్యార్థుల సలహాలను, అనుభవాలను (Feed back) తీసుకొని వాటిని గైడ్‌లో పొందుపరిచే ప్రయత్నం జరిగింది.

ఈ గైడ్‌ను రచిస్తున్నప్పుడు విద్యాలయాల్లో సంస్థ పని ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న దశలో ఉన్న మన యూనిట్లు మరియు భారతదేశంలోని పలు ప్రాంతాలను దృష్టిలో ఉంచుకోవడం జరిగింది. కాబట్టి కొన్ని పటిష్టమైన యూనిట్లకు గైడ్‌లోని ఎన్నో అంశాలు పాతవిగా తోచవచ్చు. అటువంటి యూనిట్లకు మా సలహా ఏమిటంటే - వారు తమను తాము గైడ్‌లోని ప్రోగ్రాములకే పరిమితం చేసుకోకూడదు. ఆలోచన, పరిశీలన మరియు పరిశోధనలను కొనసాగించి క్రొత్త క్రొత్త అనుభవాలను ఆవిష్కరించాలి. గైడ్ కేవలం మార్గనిర్దేశకత్వం కొరకు మాత్రమే రచించబడింది. పరిశోధన, క్రొత్త అనుభవాల తలుపులను మూసివేయడం దీని లక్ష్యం కాదు, ఆశించబడే ఫలితం అంతకన్నా కాదు.

కొంతమంది మిత్రుల సలహాపై ధార్మిక విద్యాలయాల విషయంలో ఒక భాగాన్ని ఈ గైడ్‌లో చేర్చి విద్యాలయాల్లో పనికి సంబంధించిన అంశాన్ని సంపూర్ణంగావించాలన్న ఆలోచన కలిగింది. కానీ ధార్మిక విద్యాలయాల వాతావరణం, అక్కడి పని విధానాలు, అవసరాలు ఎంతో భిన్నమైనవి మరియు వైవిధ్యభరితమైనవి. అటువంటి అంశాన్ని కేవలం ఒక్క భాగంలో చర్చించి అవసరాలను తీర్చడం సాధ్యం కాదు. దానికి ప్రత్యేకంగా ఒక గైడ్ అవసరమవుతుంది. కాబట్టి ఈ అంశాన్ని ఇందులో చర్చించలేదు.

ఈ గైడ్ యొక్క స్థాయి సంస్థాగత దస్తావేజు (Official Document) లాంటిది కాదు. సంస్థ యొక్క ప్రోగ్రామ్, దాని పాలసీ మరియు దాని నిర్ణయాలు మొదలయినవాటిని నిబంధనావళి, పాలసీ ప్రోగ్రామ్ మరియు ఇతర నిర్ణయాల్లో చూడగలము. సంస్థ పాలసీ వెలుగులో రచయిత యొక్క వ్యక్తిగత సలహాలు, సూచనల సమాహారమే ఈ గైడ్. ఇందులోని అంశాలపై చర్చలు, వాదనలు, సంస్కరణలు, మార్పులూచేర్పులూ, స్వీకరణలు, నిరాకరణలు మొదలయిన అవకాశాలు అన్ని స్థాయిల్లోనూ ఉన్నాయి. పాఠకుల్లో, ముఖ్యంగా విద్యాలయాల్లో పనిచేసే సందర్భంలో ఈ గైడ్ ద్వారా ప్రయోజనం పొందుతున్నవారు తమ అనుభవాల వెలుగులో తప్పనిసరిగా దీనిపై సమీక్షలు చేయండి, సలహాలను అందించండి. తద్వారా వాటి వెలుగులో మలిముద్రణలో సరయిన సంస్కరణలు చేయగలము.

గైడ్ రూపకల్పనలో తమ అమూల్యమైన సలహాలను అందించి సహకరించిన నా సోదరులందరికీ కృతజ్ఞతలు. ముఖ్యంగా తమ విలువయిన అనుభవాలను అందించిన విద్యార్థి మిత్రులందరికీ కృతజ్ఞుడిని. వారి ప్రోత్సాహం, సహకారం లేకపోతే ఈ పుస్తకానికి ఒక రూపాన్ని ఇవ్వలేకపోయేవాడిని.

నేను నా ప్రియమిత్రులు, సోదరులు ఇర్ఫాన్ వహీద్, తన్వీర్ ఆలమ్‌లకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలపడాన్ని నా బాధ్యతగా భావిస్తున్నాను. వారిద్వారా వెలువడిన ప్రయోజనకరమైన సలహాలు, కంపోజింగ్, సంస్కరణ, ప్రూఫ్‌రీడింగ్, అవసరమైన సమాచారాన్ని అందించడం మొదలయినవాటిలో వారి పరిశ్రమ, కృషి లేనట్లయితే బహుశా ఈ గైడ్‌ను రూపొందించడం మరియు ముద్రించడం సాధ్యపడేది కాదేమో.

సర్వసృష్టికర్త అయిన అల్లాహ్ మనందరికీ ప్రతి స్థాయిలోనూ, ధర్మం మరియు ఉద్యమాలకు చెందిన ప్రతి పనిలోనూ ముందడుగు వేసి నెరవేర్చే సద్బుద్ధిని, అవకాశాలను ప్రసాదించుగాక ! ఆమీన్ !

**ఢిల్లీ** **- సయ్యద్ సఆదత్ హుసైని**

పరమ కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# నేనూ...

ఎస్.ఐ.ఓ. మాజీ జాతీయ అధ్యక్షులు బ్రాదర్ సయ్యద్ సఆదత్ హుసైనీ ఉర్దూలో రాసిన క్యాంపస్ గైడ్‌ను తెలుగులో అనువదించమని ఎస్.ఐ.ఓ. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాఖ నన్నాదేశించింది.

అనువాదంలో ఏపాటి అనుభవమూ లేదు నాకు. ఈ పుస్తక అనువాదం మోయలేని బరువేమోనని మొదట్లో కాస్త భయపడినా అల్లాహ్ పై భారం వేసి ప్రారంభించాను. ప్రారంభంలో అనువాద కార్యక్రమం నత్తనడకనే సాగింది. చివరకు నిఖిల జగతికి ప్రభువైన అల్లాహ్ అనుగ్రహంతో, సోదరులు రిజ్వాన్ బేగ్, ముహమ్మద్ రఫీఖ్, అఫ్రోజ్ అహ్మద్‌ల ప్రోత్సాహంతో ఈ పనిని పూర్తిచేయగలిగాను. వీరికి నా కృతజ్ఞతలు. సంస్థ అభివృద్ధికి దోహదపడే పని చేయగలిగినందుకు ఎంతో సంతోషంగా ఉంది. అందుకు అల్లాహ్‌కు ఎంతో కృతజ్ఞుణ్ణి.

అనువాదంలో ఇది నా మొదటి పుస్తకం. ప్రస్తుతం మీ చేతుల్లో ఉంది. భాషాదోషాలు లేదా వాక్య నిర్మాణంలో గాని పదబంధాలలో గాని, ఏవైనా తప్పులు కనబడితే సహృదయంతో తెలియజేయగలరు. వాటిని మలిముద్రణలో సరిచేయ వీలవుతుంది.

**- ఏలూరు జీలాని**



1

# విద్యార్థుల్లో సంస్థ పని ఎందుకు?

భారతదేశంలో ఇస్లాం ధర్మసంస్థాపనకై ఇస్లామీయ ఉద్యమం సుదీర్ఘమైన కృషి చేయవలసి ఉంది. ఈ కృషి ఎన్నో రంగాల్లో చేయవలసి ఉంది. ముస్లింలలోనూ చేయవలసి ఉంది, ముస్లిమేతరులలోనూ చేయవలసి ఉంది. జీవితానికి చెందిన ప్రతి ముఖ్యమైన రంగంలోనూ చేయవలసి ఉంది. ఈ మార్గంలో ఎన్నో సవాళ్ళను ఎదుర్కోవలసి ఉంటుంది.

పండితుల నుంచి పామరుల వరకు ఇస్లామీయ ఉద్యమం ఇస్లామీయ సందేశాన్ని చేరవేయవలసి ఉంది. ఈ లక్ష్యసాధనకై వర్తమాన కాలానికి చెందిన వాడుక భాషలో ఇస్లాంను పరిచయం చేయాలి. ఆధునిక యుగపు సమస్యలను లోతుగా సమీక్షించి ఇస్లాం వెలుగులో వాటి పరిష్కారాలను చూపవలసి ఉంటుంది. ఆధునిక యుగం లేవనెత్తిన అనేక అభ్యంతరాలకు తగిన ఆధారాలతో సమాధానాలు ఇవ్వవలసి ఉంటుంది.

ఇస్లామీయ సందేశం కొరకు మీడియాను విస్తృతంగా ఉపయోగించుకోవాలి. ప్రసార సాధనాలకు చెందిన రంగాలను ప్రభావితం చేసే శక్తులను మన దృక్పథాన్ని అర్థం చేసుకోగల రీతిలో రూపొందించవలసి ఉంటుంది. మనం సమాజంలోని విభిన్న భాగాల్లో ప్రవేశించి వాటి ఆలోచనలను, దృక్పథాలను ప్రభావితం చేయవలసి ఉంటుంది.

మనం ముందుగా విభిన్న శాస్త్రాల్లో, కళల్లో ప్రావీణ్యం సంపాదించాలి. తద్వారా ఆ శాస్త్రాలకు, కళలకు సంబంధించిన రంగాల్లో ఇస్లామీయ దృక్కోణంలో సంస్కరణలను తీసుకువచ్చేందుకు ప్రయత్నం చేయాలి.

మనం సాహిత్య, సాంస్కృతిక రంగాలను ప్రభావితం చేయాలి. ప్రజలందరి మనోమస్తిష్కాలపై, వైఖరులపై వీటి మంచి లేదా చెడు ప్రభావాలు పడతాయి. సర్వతోముఖ మార్పును తీసుకురావడానికై మనం మన ప్రతిభావంతుల ద్వారా ఈ అంశాలపై ఇస్లామీయ దృక్కోణంలో ప్రభావితం చేయవలసి ఉంటుంది. మనం కేవలం ముస్లింల సాహిత్యాలను, సంస్కృతులను ప్రభావితం చేయడం మాత్రమే కాకుండా ఈ దేశంలోని విభిన్న ప్రాంతాలకు చెందిన సాహిత్యాలను, సంస్కృతులను కూడా ప్రభావితం చేయవలసి ఉంటుంది.

మనం గొప్ప సార్వత్రిక లక్ష్యాల సాధనకై ఏర్పరచుకున్న విభిన్న సంస్థలను విజయవంతంగా నడపాలి. అలాగే ఇలాంటివే మరిన్ని విభాగాలను నెలకొల్పవలసి ఉంటుంది. అందుకు ఉన్నత సామర్థ్యం గల నిర్వాహకులు, వివిధ రకాల వృత్తివిద్యా నిపుణులు (Professionals) మనకు ఎంతో అవసరం.

ఈ పనులన్నింటినీ మనం చేయవలసి ఉంది. వీటి పరిపూర్తి కోసం సుదీర్ఘ పరిశ్రమ అవసరం. దీనికిగాను ప్రాథమికంగా రెండు అంశాల ఆవశ్యకత ఉంది :

1. యోగ్యత, సామర్థ్యం, చింతన మరియు చైతన్యాలను పుష్కలంగా కలిగియున్న యోగ్యులు, సమర్థులు మనవద్ద ఉండాలి.
2. దేశంలో ఏదో ఒక రంగంలో ముఖ్యమైన కార్యాలను చేపట్టేవారందరినీ ప్రభావితం చేసి వారి చింతనాధోరణికి క్రొత్త దిశను సూచించాలి.

ఈ సుదీర్ఘమైన బృహత్ లక్ష్యం విద్యార్థులపై పని చేసినప్పుడే సాధించబడుతుంది. రేపటి ప్రతిభావంతమయిన, ప్రభావవంతమైన శక్తులు నేడు విద్యాలయాల్లో విద్యనభ్యసిస్తున్నాయి. వందకోట్ల జనాభా గల మన భారతదేశంలో ఉన్న 200 యూనివర్శిటీలు, కొన్ని వేల కాలేజీలు చిన్న చిన్న ద్వీపాల వంటివి. కానీ ఈ ద్వీపాల పైనే దేశ భవిష్యత్తు ఆధారపడి ఉంది.

ఇక్కడ ముస్లిం మరియు ముస్లిమేతర విద్యార్థులపై పూర్తి ఏకాగ్రతతో పనిచేసినట్లయితే, ఇంకా రాబోవు కొన్ని సంవత్సరాల కాలవ్యవధిలో దేశంలోని విద్యార్థులందరి వరకూ చేరుకొని వారి ఆలోచనాసరళిని రూపొందించేందుకై ప్రణాళికాబద్ధమైన కృషి జరిపినట్లయితే ఇస్లామీయ ఉద్యమానికి క్రింద తెలుపబడిన ప్రయోజనాలు చేకూరుతాయి.

(1) ఆ విద్యార్థులలో కొంతమంది ఉద్యమంతో జతగూడుతారు. వారిలో చింతన జనిస్తుంది. ఒక ప్రవర్తనాసరళి రూపొందుతుంది. వారు ఎక్కడికి వెళ్ళినా ఉద్యమం కొరకు పనిచేస్తారు. దాని ఫలితంగా సమర్థవంతులు, యోగ్యులు, ఆలోచనా పరులు, ఇంగ్లీషు, హిందీ మరియు ప్రాంతీయ భాషాకోవిదులయిన పాత్రి కేయులు, సాహిత్యకారులు, చిత్రకారులు, రచయితలు, నిర్వాహకులు,

ఉపాధ్యాయులు, వృత్తివిద్యానిపుణులు (ఐ.టీ. ఇంజినీర్లు, ఫైనాన్స్ ప్రొఫెషనల్స్, మేనేజర్లు , ప్లానర్స్ మొదలయినవారు), న్యాయవాదులు, సామాజిక మరియు ఆర్థిక శాస్త్రాల నిపుణులు, చరిత్రకారులు, తత్త్వవేత్తలు మొదలయినవారితో కూడిన ఒక పెద్ద సమూహం మనకు లభిస్తుంది. వారి ద్వారా జీవితపు విభిన్న రంగాలను చెప్పుకోదగ్గ రీతిలో ఇస్లామీయ ఉద్యమం ప్రభావితం చేయగలదు.

( 2 ) ముస్లిం విద్యార్థులు ఎక్కువ సంఖ్యలో ఉద్యమంలో చేరకపోయినా వారి ఆలోచన, ప్రవర్తనాసరళులను సకారాత్మక రీతిలో ప్రభావితం చేయడంలో ఎస్. ఐ. ఓ విజయం సాధించగలదు. ఆ విద్యార్థులకు కూడా సంస్థ పట్ల ఆసక్తి జనిస్తుంది. ఇంకా తమ తమ రంగాల్లో ఉద్యమానికి తోడ్పడగలరు.

( 3 ) కొంతమంది ముస్లిమేతర విద్యార్థులు ఇస్లాంను అధ్యయనం చేసి, అర్థం చేసుకొని ఇస్లాం వల్ల ప్రభావితులవుతారు. వారు కూడా ఉద్యమం కొరకు మూలసంపదగా రూపొందుతారు.

( 4 ) మన సందేశ కార్యక్రమాల ఫలితంగా కొంతమంది విద్యార్థులు పూర్తి ఇస్లామీయ విశ్వాసాలతో, నియమాలతో ఏకీభవించకపోయినా ఇస్లాం పట్ల వారి దృక్పథం సకారాత్మకంగానూ, సత్యాన్ని ప్రేమించేదిగానూ ఉంటుంది. వారు ఎక్కడికి వెళ్ళినా ఇస్లాం మరియు దాని నియమాల విషయంలో వారి వైఖరి సానుభూతి పూర్వకంగా, మేలు కోరేదిగా ఉంటుంది. వారు తమ తమ రంగాల్లో ఇస్లాం వ్యతిరేక వైఖరులను వ్యతిరేకిస్తారు. ఈ విధంగా వారు ఇస్లామీయ ఉద్యమానికి బయటినుంచి మద్దతు తెలిపే వర్గం(Outer Support Group) గా పనిచేస్తారు.

( 5 ) కొంతమంది ముస్లిమేతర విద్యార్థుల్లో నైతిక విలువల పునరుద్ధరణకై మనం చేసే కృషి కారణంగా నైతిక విలువల పట్ల చైతన్యం జనిస్తుంది. కనీసం ఈ దేశం కొరకు నైతిక నియమాల విషయంలో ఇస్లామీయ ఉద్యమం రూపొందించుకున్న పథకాల సాఫల్యానికి వారు దోహదపడతారు.

ఈ విధంగా విద్యార్థుల్లో పనిచేయడమనేది ఇస్లామీయ ఉద్యమానికి ఉపయోగపడేది మాత్రమే కాకుండా దాని సుదీర్ఘమైన కార్యాచరణ పథకానికి సంబంధించిన తప్పనిసరి అంశం కూడా. ఈ పని పైనే భవిష్యత్తులో ఇస్లామీయ ఉద్యమం యొక్క శాశ్వత స్థానం, ప్రభావశీలత ఆధారపడియున్నాయి. ఒకవేళ ఈ పని జరగనట్లయితే భవిష్యత్తులో ఉద్యమం ప్రభావరహితంగా మారిపోయే అవకాశముంది. అలాగే దేశపరిస్థితులను చక్కదిద్దడంలో దాని పాత్ర ఏమీ ఉండదు.

ఇస్లామీయ ఉద్యమానికి సంబంధించి ఈ బృహత్తర కార్యం కొరకు మనం (అంటే ఎస్.ఐ.ఓ.) బాధ్యులుగా చేయబడ్డాము.

మనం ఈ పని ప్రాముఖ్యతను గుర్తించగలిగిననాడే మన బాధ్యతను సక్రమంగా నెరవేర్చగలము. ఈ పని చేసేందుకై విద్యార్థి సంబంధిత కార్యకలాపాలపై పూర్తిగా దృష్టిని కేంద్రీకరించవలసి ఉంటుంది.



2

# మనం విద్యార్థుల్లో ఏ పని చేయాలనుకుంటున్నాం?

మనం విద్యార్థుల్లో పని చేసి ఏం సాధించాలనుకుంటున్నాం? ఈ ప్రశ్నకు సంక్షిప్త వివరణ క్రింద పొందుపరచబడింది.

**ముస్లిం విద్యార్థులు :**

( 1 ) ముస్లిం విద్యార్థులు ఇస్లాం ధర్మానికి చెందిన మౌలిక మరియు నిజమైన అవగాహనను, స్పృహను పొందాలని మనం ఆశిస్తున్నాం. పవిత్ర ఖుర్ఆన్ మరియు హదీసుల ద్వారా మనకు లభించే ఇస్లాం యొక్క ఈ సర్వతోముఖ, విప్లవాత్మక భావాలతో వారు పరిచితులవ్వాలి.

( 2 ) ఈ భావనలను తమ జీవితాల్లో ఆచరణాత్మకంగా ప్రయోగించగల సామర్థ్యం వారిలో జనించాలి. సమతుల్యమైన చింతన, పవిత్ర నైజం, నిర్మాణాత్మకమైన ఆలోచన మొదలయినవి వారిలో జనించాలి.

( 3 ) వారు తమ వ్యక్తిగత, సామూహిక జీవితాల్లో ఇస్లాం ధర్మబోధనల ప్రకారం నడచుకోవాలి.

( 4 ) ఇస్లాం ధర్మ పునరుద్ధరణకు, దాని స్థాపనకై మరియు ఇస్లాం సందేశ ప్రచారానికై వారు ఉద్యమించాలి.

( 5 ) వారిలో ఇస్లామీయ స్పృహ, ఇస్లాం కోసం పరిశ్రమించే మరియు త్యాగాలు చేసే చైతన్యం, ఇంకా ఇతర పవిత్రమైన భావనలు పెంపొందాలి.

( 6 ) వారు ఉన్నత ప్రమాణాలతో ఉన్నత విద్యను అభ్యసించాలి.

( 7 ) వారి సహజ సామర్థ్యాలు అభివృద్ధి చెందాలి. వారి సామర్థ్యాలు ఉత్కృష్టస్థాయి (Optimum Level) వరకు అభివృద్ధి చెందాలి.

( 8 ) వారి వ్యక్తిత్వం సర్వతోముఖంగా వికసించాలి. ఆత్మవిశ్వాసం, ఆత్మస్థయిర్యం, సమర్థత (Efficiency), నిజాయితీ, నాయకత్వపు సామర్థ్యాలు, సృజనాత్మకత, నవ్యత (Creativity and Innovation), ప్రజలను ప్రభావితం చేసి వారిని

కలుపుకొని పనిచేసే సామర్థ్యం (Group Dynamics) మరియు ఇంకా ఆవశ్యక లక్షణాలు పెంపొందాలి.

( 9 ) ఇస్లాం కొరకు సామూహికంగా పనిచేయవలసిన ప్రాముఖ్యత యొక్క స్ఫృహను, జ్ఞానాన్ని వారు పొందాలి. సామూహిక జీవితపు మర్యాదల పట్ల వారికి అవగాహన కలగాలి. చివరకు వారు ఇస్లామీయ ఉద్యమంలో ఒక భాగమై ఇస్లాం ధర్మ సంస్థాపనకై కృషి చేయాలి.

**ముస్లిమేతర విద్యార్థులు :**

( 1 ) ఇస్లాం పట్ల శత్రుత్వభావన వారిలో మిగిలివుండరాదు. ఇస్లాం పట్ల వారు ఏర్పరచుకున్న తప్పుడు అభిప్రాయాలు దూరం కావాలి.

( 2 ) వారు ఇస్లాంను సకారాత్మక దృక్పథంతో అర్థం చేసుకోవాలి. ఇస్లామీయ బోధనలు తమ వాస్తవ నేపథ్యంలో వారి ముందు బహిర్గతం కావాలి.

( 3 ) ప్రాపంచిక విజయానికీ, పరలోక సాఫల్యానికీ ఇస్లాం మాత్రమే హామీ ఇవ్వగలదన్న సత్యం వారికి ప్రస్ఫుటమవ్వాలి. ఆ విధంగా ఇస్లామీయ సందేశం వారి వద్దకు పూర్తిగా చేరాలి.

( 4 ) వారు ముస్లింలను దగ్గర నుంచి చూడాలి. వారికీ, ముస్లిం విద్యార్థులకూ మధ్య స్నేహ సంబంధాలు నెలకొనాలి. దూరాలు తొలిగిపోవాలి.

( 5 ) వారి గుణగణాలు సంస్కరింపబడాలి. నిజమైన దేశప్రేమ, జవాబుదారీతనం వారిలో ఉద్భవించాలి. సచ్ఛీలత, సౌశీల్యం, నిజాయితీ, సత్యసంధత, న్యాయశీలత, ఋజుమార్గవర్తనం మొదలయిన సుగుణాలతో వారి వ్యక్తిత్వం తీర్చిదిద్దబడాలి.

**విద్యాలయాల్లో .....**

( 1 ) గూండాయిజం, ర్యాగింగ్, అక్రమాలు, అల్లర్లు మొదలయిన చెడుగులన్నీ దూరం కావాలి.

( 2 ) మార్గభ్రష్టత్వం, మద్యపానం, లైంగిక విశృంఖలత్వం, అసభ్య ప్రేలాపన మొదలయిన నైతిక చెడుగులన్నీ సమసిపోవాలి.

( 3 ) ప్రాంతీయ తత్వం, కులతత్వం, వర్గతత్వం, మతవిభేదాలు, ఆశ్రిత పక్షపాతం, వర్గ సంఘర్షణలు మొదలయినవి అంతం కావాలి. ఇంకా సోదరభావం, సమానత్వంతో కూడిన వాతావరణం రూపొందాలి.

( 4 ) విద్యాలయాల్లోని ప్రశాంత వాతావరణానికి భంగం కలిగించే, ప్రభావితం చేసే చెడుగులన్నీ దూరం కావాలి.



# 3

# మౌలిక విషయాలు

క్యాంపస్‌లో పని ప్రారంభించడానికి ముందు ఆ పని ప్రాముఖ్యతను, ఆవశ్యకతను మనం అర్థం చేసుకోవాలి. ఇస్లామీయ ఉద్యమం యొక్క పాలసీలో ఈ పని యొక్క ప్రాముఖ్యత ఎంతగా ఉందో మనం గ్రహించాలి. ఇంకా భవిష్యత్తులో ఇస్లామీయ సందేశం విజయవంతం కావడానికి ఈ పని ఎంత అవసరమో కూడా మనం గ్రహించాలి.

ప్రాముఖ్యతనూ, ప్రయోజనాన్ని అర్థం చేసుకోవడమే కాకుండా పూర్తి నమ్మకంతో, విశ్వాసంతో ఈ పని చేసేందుకై ముందడుగు వేయాలి. కాలేజీలలో పని అంత కష్టమైనదేమీ కాదు. ప్రతి విద్యార్థీ ఈ పని చేయగలడు. ప్రతి చదువుకున్న వ్యక్తీ ఈ పని చేయగలడు. షరతు ఏమిటంటే మనం దృఢమైన సంకల్పబలంతో ముందడుగు వేయాలి. ఇంకా పని చేయడానికి సంబంధించిన నిజమైన చైతన్యం మనలో ఉండాలి.

విద్యాలయాల్లో పని యొక్క రూపం, విధానం ఏమై వుండాలి ? అనే ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానమివ్వడం, ఖచ్చితమైన కార్యాచరణ విధానాన్ని సూచించడం సాధ్యం కాదు. వివిధ కాలేజీల పరిస్థితులు వేర్వేరుగా ఉంటాయి. వాటిని దృష్టిలో ఉంచుకొని వివిధ రకాల కార్యక్రమాలను రూపొందించాలి. పని విధానం యొక్క వివిధ ప్రత్యామ్నాయాలను (Options) మరియు సరయిన కార్యాచరణ విధానాన్ని తయారు చేయడంలో సహాయపడగలదన్న ఉద్దేశ్యంతోనే ఇక్కడ ఒక సాధారణ కార్యక్రమం యొక్క నమూనాను మీ ముందుంచడం జరుగుతోంది.

దానికి ముందు కొన్ని ముఖ్య విషయాలను దృష్టిలో ఉంచుకోవాలి :

➤ మన శిక్షణ మరియు సందేశాత్మక కార్యకలాపాలన్నీ విద్యాలయాల్లో సక్రమంగా మరియు క్రమం తప్పకుండా జరగాలి. కొన్ని కాలేజీలలో మాత్రమే ఇవి సాధ్యమవుతాయి. అనేక విద్యార్థి సంఘాలు పనిచేస్తున్న, విభిన్న సంస్కృతులకు నిలయమైన భారత సమాజంలో ఏదయినా ఒక ప్రత్యేక విద్యార్థి సంస్థకు తమ కాలేజీలో కార్యక్రమాల నిర్వహణకు అనుమతి ఇవ్వడమనేది స్వయంగా ఆ కాలేజీ యాజమాన్యానికి ఆచరణరీత్యా సాధ్యం కాదు.

➢ సాధారణంగా విద్యార్థి సంఘాలు విద్యాలయాలను విద్యార్థుల సేవకు, వారి సమస్యలను పరిష్కరించడానికి, ఇంకా వారితో విస్తృత సంబంధాలను పెంపొందించడానికి వినియోగిస్తాయి. పరిచయమైన విద్యార్థుల మనోవైఖరులను తీర్చిదిద్దేందుకు మరియు వారి శిక్షణ కోసం విద్యాలయాల వెలుపల (సౌలభ్యమున్న ప్రదేశాల్లో ) కార్యక్రమాలను నిర్వహిస్తాయి. భారతదేశంలో ఎక్కువ చోట్ల ఈ విధానమే ఆచరణరీత్యా సాధ్యమవుతుంది. మరి మనం కూడా ఈ విధానాన్నే విజయవంతంగా అమలుచేయడానికి శిక్షణ పొందాలి.

➢ ఇక మనం విద్యాలయాల్లోని విద్యార్థులతో విస్తృత సంబంధాలను ఏర్పరచుకుందాం. వారి సమస్యల్లో పాలుపంచుకుందాం. రోజువారీ సమస్యలను ఎదుర్కోవడంలో వారికి నాయకత్వం వహిస్తూ దిశానిర్దేశం చేద్దాం. వారికి సేవ చేద్దాం. ఈ లక్ష్య సాధనకై చిన్న, పెద్ద సంస్థలను నడుపుదాం. కాలేజీ కార్యకలాపాల్లో భాగస్వాములమవుదాం. కాలేజీలోని వివిధ వేదికలను మన ఆలోచనల, దృక్పథాల ప్రచారానికై యుక్తితో ఉపయోగించుకుందాం.

➢ ఈ కార్యక్రమాల ఫలితంగా పరిచయమయిన విద్యార్థులను వీలయిన ఏదో ఒక బయటి ప్రదేశానికి తీసుకెళదాం. వారి కోసం వారాంతపు సమావేశాలు (Weekend Ijthima) నడుపుదాం. శిక్షణాసమావేశాలు నడుపుదాం. క్యాంపులు నిర్వహించి వారి మనోవైఖరులను తీర్చిదిద్దేందుకు సాధ్యమయిన అన్ని మార్గాలనూ అవలంబిద్దాం.

➢ విషయమేమిటంటే, మనం నిర్వహించే విద్యార్థి సంబంధిత కార్యక్రమాలు విద్యాలయాల నాలుగు గోడల లోపల మరియు వెలుపల కూడా జరుగుతాయి. వాటిలో తగిన సమతుల్యతను తీసుకురావడం ద్వారానే విద్యార్థుల్లో ఏదయినా మార్పును తీసుకురాగలం.

➢ మన అసలు లక్ష్యం ఈ దేశంలోని విద్యార్థులే. మనం వారి ఆలోచనల్లో, ప్రవర్తనల్లో సకారాత్మక మార్పును తీసుకురాదలిచాము. ఈ లక్ష్యం కోసం ఎక్కడెక్కడ ఏయే రంగాల్లో మనం పని చేయవలసివచ్చినా చేద్దాం. ఎందుకంటే సాధారణంగా విద్యార్థులు విద్యాలయాల్లో సునాయాసంగా ఒక్కుమ్మడిగా దొరుకుతారు. వారి

సమయంలో ఎక్కువ శాతం అక్కడే గడుస్తుంది. కాబట్టి విద్యాలయాలపై మన ప్రత్యేక శ్రద్ధ ఉండాలి. కానీ విద్యార్థుల సమయంలోని ఎక్కువ భాగం హాస్టళ్ళల్లో, వారు బస చేసే గదుల్లో కూడా గడుస్తుంది. కొన్ని సందర్భాల్లో విద్యాలయాల్లో కంటే వారి వసతి గృహాల్లోనే వారితో సంబంధాలను ఏర్పరచుకోవడానికి, వారి మనోవైఖరులను తీర్చిదిద్దడానికి, వారికి సేవ చేయడానికి ఎక్కువగా వీలవుతుంది, ఆచరణ రీత్యా సాధ్యమవుతుంది. కనుక విద్యార్థులు నివసించే గదులపై కూడా మనం శ్రద్ధ వహిద్దాం.

ఈ దేశంలోని ఎక్కువ మంది విద్యార్థులతో, అంటే ముస్లింలతో మరియు ముస్లిమేతరులతో సంబంధాలు ఏర్పరుచుకొని వారికి శిక్షణ గరపడమే మన అసలు లక్ష్యం. ఈ పని ఏ కార్యాచరణ విధానం వల్ల సులభసాధ్యమవుతుందో దానిని మనం స్వీకరిద్దాం. విద్యాభ్యాస కాలం శిక్షణ మరియు తర్ఫీదులతో కూడిన కాలం. ఈ దశలో వ్యక్తి యొక్క వ్యక్తిత్వం ఏదో ఒక ప్రత్యేక దిశలో అభివృద్ధి చెందుతుంది. ఈ పరిమిత కాలంలోనే ఒక విద్యార్థి ఒక మనోవైఖరిని, ఒక స్వభావాన్ని, ఒక ఆలోచనాసరళిని, ఒక ప్రవర్తనాశైలిని, కొన్ని గుణగణాలను, మరికొన్ని సామర్థ్యాలను తనలో పెంపొందించుకొని భవిష్యత్తులో సమాజంలో ఏదో ఒక బాధ్యతను నిర్వర్తించేందుకు తగినవిధంగా రూపొందు తాడు. విద్యార్థి యొక్క ఈ వ్యక్తిత్వ వికాస ప్రక్రియను సరయిన రీతిలో ప్రభావితం చేయడమే మన అసలు కర్తవ్యం.

ఈ పని కోసం మన దృష్టి విద్య, తత్సంబంధిత సమస్యలు, విద్యార్థుల సరయిన శిక్షణ మరియు సంస్కరణలపైనే కేంద్రీకృతమవ్వాలి. మనం మన సంబంధీకులకు, సాధారణ విద్యార్థులకు చదివేందుకు, రాసేందుకు తమలోని శక్తిసామర్థ్యాలను అభివృద్ధి పరచుకునేందుకు తగిన అవకాశాలను వారికి ఇవ్వాలి. ఈ మార్గంలో ఎదురయ్యే అడ్డంకు లన్నింటినీ లెక్కచేయరాదు.

ప్రతి చిన్న, పెద్ద సామాజిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యల్లో పూర్తిగా తలదూర్చడం, ఒక సార్వత్రిక సంస్థకు చెందిన బాధ్యతలన్నింటినీ తలకెత్తుకోవడం ఒక విద్యార్థి సంస్థ పని కాదు. ఒకవేళ అది అలా చేస్తున్నట్లయితే ఒక స్వల్పకాలిక (Short Term) ప్రయోజనం కోసం, పెద్దదయిన దీర్ఘకాలిక (Long Term) ప్రయోజనాన్ని పణంగా పెట్టినట్లవుతుంది.

మనం ప్రతి సమస్య విషయంలోనూ విద్యార్థుల మనోవైఖరిని రూపొందిద్దాం. వివిధ సామాజిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యల విషయంలో సరయిన మనోవైఖరులను తీర్చిదిద్దేందుకై విద్యార్థుల కొరకు విభిన్న కార్యక్రమాలను నిర్వహిద్దాం. ఏదయినా ముఖ్యమయిన సంక్లిష్ట సమస్య విషయంలో పెద్దల మార్గదర్శకత్వంలో మనం వారికి తోడ్పడేందుకై ముందడుగు వేద్దాం. మన కార్యక్రమాలు, కార్యకలాపాలు విద్య, విద్యార్థి మరియు విద్యాలయాలకు సంబంధించిన సమస్యలను పరిష్కరించేందుకై మాత్రమే ఉద్దేశించబడి ఉంటాయి లేదా ముస్లిం మరియు ముస్లిమేతర విద్యార్థుల మనోవైఖరులను తీర్చిదిద్దేందుకై, శిక్షణనిచ్చేందుకై ఉద్దేశించబడి ఉంటాయి.

ఈ కేంద్రీకరణ (Concentration) విషయంలో మన వైఖరి స్పష్టంగా లేనట్లయితే వేల సంఖ్యలో కార్యక్రమాలను నిర్వహిస్తూ వివిధ సామాజిక, జాతీయ సంస్థల సంఖ్యను మరికొంత పెంచినట్లవుతుందే కానీ ఒక ఇస్లామీయ విద్యార్థి సంస్థగా మనపై మోపబడ్డ అసలు బాధ్యతలను, ఇంకా భావి ప్రపంచ రూపకల్పనకు సంబంధించిన నిజమైన బాధ్యతలను మనం నిర్వర్తించలేకపోతాము.

ఈ మౌలిక విషయాల తర్వాత ఇప్పుడు మనం విద్యాలయాల్లో ఏయే పనులు చేయగలమో తెలుసుకుందాం రండి !



# 4

# విద్యార్థుల్లో, విద్యాలయాల్లో పని ఎలా ప్రారంభించాలి?

విద్యాలయాల్లో పని ఎలా ప్రారంభించాలి ? అనే ప్రశ్న దాదాపుగా అన్ని ప్రాంతాల వారిని ఎక్కువగా వేధిస్తూ ఉంటుంది. ఏ మార్గాలను అవలంబించాలి ? మొదట ఏయే పనులు చేయాలి ? ఈ శీర్షికలో పై ప్రశ్నలకు సమాధానాలను వివరంగా తెలుసుకుందాం.

**మనం మూడు వేర్వేరు విధానాల్లో ఈ సమస్యకు పరిష్కారాలను అన్వేషిద్దాం.**

( 1 ) రాష్ట్రస్థాయి విద్యాలయాల్లో ఎస్.ఐ.ఒ. స్థాపనకై ఏం చేయాలి ?

( 2 ) స్థానికంగా విద్యాలయాల్లో ఎస్.ఐ.ఒ. స్థాపనకై ఏం చేయాలి ?

( 3 ) మనం చదువుతున్న విద్యాలయాల్లో సంస్థను ఎలా స్థాపించాలి ?

## రాష్ట్రస్థాయిలో మరియు స్థానిక స్థాయిలో...

కొన్ని రాష్ట్రాల్లో ఇప్పటికీ విద్యాలయాల్లో, విద్యార్థుల్లో సంస్థ స్థాపన చాలా తక్కువగా ఉంది. అటువంటి ప్రాంతాల్లో ఈ దిశగా ఎంతగానో పురోగమించవలసిన అవసరముంది. రాష్ట్రస్థాయిలో విద్యాలయాల్లో సంస్థను నెలకొల్పడానికి కార్యాచరణ ప్రణాళిక క్రింది విధంగా ఉండాలి :

( 1 ) తెలివయిన, సమర్థవంతులైన కొంతమంది సభ్యులను ఇతర సంస్థాగత బాధ్యతల నుంచి తొలిగించి కేవలం విద్యాలయాల్లో పని నిమిత్తం నియమించాలి.

( 2 ) జోన్ పెద్ద పెద్ద విద్యాలయాలను కలిగియున్న, పెద్ద నగరాల్లోనూ, పట్టణాల్లోనూ ఉన్న తన అన్ని యూనిట్లలోనూ, సర్కిళ్ళలోనూ విద్యార్థుల్లో మరియు విద్యాలయాల్లో సంస్థను పాదుకొల్పడాన్ని ప్రత్యేక లక్ష్యంగా చేసుకుంటుంది.

( 3 ) ఇటువంటి ప్రాంతాల్లో తెలివయిన, సమర్థులయిన విద్యార్థుల (తక్కువ వయస్సు ఉన్న విద్యార్థులయితే ఎక్కువ కాలం సంస్థలో పని చేస్తారు.) టీములను అభివృద్ధి చేయాలి. ఈ పనిపై పూర్తిగా దృష్టిని కేంద్రీకరించాలి. నియుక్తులయిన వ్యక్తుల, తెలివయిన వ్యక్తుల, సమర్థుల జాబితాను తయారుచేసి వారిని కలుసుకోవడం జరుగుతుంది. వారి మనోవైఖరులను తీర్చిదిద్దడం జరుగుతుంది. ( వివరాల

కొరకు ఈ పుస్తకంలోని ' వ్యక్తిగత పరిచయాలు - సంబంధాలు ' అనే శీర్షిక చూడండి)

( 4 ) ఆ వ్యక్తులను అసోసియేట్లుగా మార్చుకోవడం జరుగుతుంది. వారి శిక్షణ మరియు సంస్కరణల పరంపర కొనసాగించబడుతుంది.

( 5 ) ఎప్పుడయితే ఏదైనా కాలేజీలో అసోసియేట్లతో కూడిన ఒక టీము తయారయి, అందులోని ఇద్దరు లేదా ముగ్గురు దృఢమైన అసోసియేట్లు రూపొందడం జరుగుతుందో వెనువెంటనే అక్కడ సర్కిల్ స్థాపించబడుతుంది. ఆ తర్వాత ఆ కాలేజీలో లేదా దానికి సమీపంలో విద్యార్థుల కొరకు క్రమానుగత సంస్కరణాత్మక కార్యక్రమాలు ప్రారంభించబడతాయి.

( 6 ) ఒకటి లేదా రెండు నెలల వ్యవధిలో ప్రణాళికాబద్ధంగా విద్యార్థుల సేవకు సంబంధించిన కొన్ని కార్యకలాపాలు ప్రారంభించబడతాయి. (వివరాల కొరకు ఈ పుస్తకంలోని 'విద్యార్థుల సేవ మరియు వారి సమస్యలకు పరిష్కారాలు' అనే శీర్షిక చూడండి)

( 7 ) ఈ విధంగా విద్యార్థుల్లో 'తజ్కియహ్' (సంస్కరణాత్మక శిక్షణ) మరియు సేవలకు సంబంధించిన కార్యకలాపాల ద్వారా ఈ క్రింది లక్ష్యాలను సాధించే ప్రయత్నం జరుగుతుంది:

★ క్రొత్త విద్యార్థులతో పరిచయాలను ఏర్పరచుకొని వారి మనోవైఖరులను తీర్చిదిద్దుతూ వారిని సంస్థ అసోసియేట్లుగా మార్చాలి.

★ అసోసియేట్లకు వైజ్ఞానికంగా, చింతనాపరంగా, నైతికంగా శిక్షణనిచ్చి వారు మెంబర్‌షిప్ స్థాయికి చేరుకునే విధంగా తీర్చిదిద్దాలి.

( 8 ) ఈ విధంగా యూనిట్ ఏర్పడిన తర్వాత బాగా ఆలోచించి సంపూర్ణ పథకం రచించబడి ఒక పూర్తి క్యాంపస్ యూనిట్ పనిచేయనారంభిస్తుంది.

( 9 ) జోన్ బాధ్యులు విద్యాలయాల్లో ఈ విధంగా పనిని ఉత్కృష్ట స్థాయికి తీసుకెళ్ళేందుకు దోహదపడే స్పష్టమైన దృక్పథాన్ని (Vision) తప్పనిసరిగా కలిగియుండాలి. ఈ

పనిమీదే వారి దృష్టి కేంద్రీకరించబడి వుండాలి. జోన్ తన యూనిట్లను విద్యార్థుల్లో పూర్తి ఏకాగ్రతతో పనిచేయలేని విధంగా ఇతర పనుల్లో నిమగ్నం చేయరాదు. పెద్దవయిన, దీర్ఘకాలిక లక్ష్యాల కొరకు చిన్న చిన్న త్యాగాలు చేసే విధంగా వారిని రూపొందించాలి.

యూనిట్ స్థాయిలో కూడా ఈ పనులే నిర్వహించబడాలి.



# 5

# మనం చదివే కాలేజీలో సంస్థను ఎలా స్థాపించాలి?

ఒకవేళ మన సభ్యుడెవరయినా ఏదేని కళాశాలలో చదువుతున్నట్లయితే అతడు క్రింది విషయాలపై దృష్టి సారించాలి. అలాగే బాధ్యులు కూడా ఈ విషయాలపై అతడి దృష్టిని కేంద్రీకరింపజేయాలి.

- ఆ కాలేజీలో అతడు వ్యక్తిగతంగా తోటి విద్యార్థులకు సేవ చేయడంలో, వారి అభివృద్ధి కొరకు సహకరించడంలో, వారి సమస్యలను పరిష్కరించడంలో, సహపాఠ్య కార్యకలాపాల్లో (Cocurricular Activities) చురుకుగా పాల్గొనడంలో నిమగ్నమయి క్రియాశీలక పాత్రను నిర్వహిస్తూ ఉండాలి. అలాగే విద్యార్థుల్లో మంచి గుర్తింపును పొందేందుకై నిత్యం కృషి చేస్తూ ఉండాలి.

  అతడు ముస్లిమేతర విద్యార్థులతో పరిచయాలను ఏర్పరచుకోవాలి. వారితో వివిధ అంశాలపై చర్చిస్తూ ఉండాలి. వారిలో ఒక మంచి, న్యాయవంతమైన, సత్యవంతుడయిన వ్యక్తిగా, సత్ప్రవర్తన గల వ్యక్తిగా అతడు గుర్తింపును పొందాలి.

- ఆ క్రమంలో అతడు సమర్థులయిన, మంచి నైజం గల కొంతమంది ముస్లిం విద్యార్థులను కలసుకోవాలి. వ్యక్తిగత కలయికలు మరియు సంబంధాల ద్వారా వారి మనోవైఖరులను తీర్చిదిద్ది వారిని అసోసియేట్లుగా రూపొందిస్తాడు.

- ఆ తర్వాత వెనుకటి పేజీల్లో 'జోన్ మరియు యూనిట్ స్థాయిలో' అనే శీర్షికలో పేర్కొనబడిన 5 మరియు 8 అంశాలు ఇక్కడ కూడా స్వీకరించబడతాయి.

( 1 ) తజ్కియహ్ (సంస్కరణ) : సంబంధీకుల మరియు ఇతర ముస్లిం విద్యార్థుల సంస్కరణ జరగాలి.

సర్వతోముఖ సంస్కరణ : పాలసీ మరియు ప్రోగ్రామ్‌లో తెలుపబడిన స్థాయిలన్నింటిలో సర్వతోముఖ సంస్కరణ జరగాలి.

( 2 ) విద్యార్థులకు సేవ చేయడమే కాకుండా వారి సమస్యలను పరిష్కరించాలి.

( 3 ) నైతిక విలువల పునరుద్ధరణ : విద్యాలయాల్లో అత్యుత్తమమైన విద్య మరియు

నైతికతతో కూడిన వాతావరణాన్ని అభివృద్ధి చేసేందుకై ప్రయత్నించాలి. అలాగే విద్యార్థులకు ఇస్లామీయ సందేశాన్ని అందించేందుకు కృషి చేయాలి.

( 4 ) కాలేజీలోని విభిన్న సహపాఠ్య కార్యకలాపాల్లో (Cocurricular Activities) పూర్తిగా పాలుపంచుకోవాలి. ఆ కార్యకలాపాలను ఉపయోగించి విద్యార్థుల మనోవైఖరులను, నైజాన్ని తీర్చిదిద్దటానికి ప్రయత్నం చేయడం.

రాబోయే పుటల్లో వీటిలో ప్రతి ఒక అంశం గురించి ఇన్‌షాఅల్లాహ్ విపులంగా చర్చించడం జరుగుతుంది. అలాగే ప్రయోజనకరమైన సాధనాలు సూచించబడతాయి.

పుస్తకం చివరి పేజీలోని పట్టిక (విద్యార్థుల్లో, విద్యాలయాల్లో సంస్థ పని) ద్వారా విద్యార్థుల్లో మరియు విద్యాలయాల్లో ముఖ్యంగా నాలుగు రంగాల్లో పని జరగాలనే విషయం స్పష్టమవుతుంది.

  

6

# సంస్కరణ (తజ్‌కియహ్)

కాలేజీలో మరియు విద్యార్థుల్లో మనం చేయవలసిన అతిముఖ్యమైన పని సంస్కరణ. 'సంస్కరణ' అంటే 'అభివృద్ధిపరచడం', 'తీర్చిదిద్దడం', 'చక్కదిద్దడం' మొదలయిన అర్థాలున్నాయి. మనం విద్యార్థుల వ్యక్తిత్వాలను సర్వతోముఖంగా తీర్చిదిద్దాలని, సంస్కరించాలని భావిస్తున్నాము. ఒక వ్యక్తి ఏ స్థాయిలో ఉన్నా అతడిని ఆ స్థాయి కంటే ఉన్నత స్థాయికి చేర్చాలనుకుంటున్నాము. మన పాలసీ ప్రోగ్రామ్‌లో క్రింద పొందుపరచబడిన అంశాల్లో సంస్కరణ జరగాలని తాకీదు చేయబడింది.

సంస్థ సంబంధీకులు సంస్కరణ విషయంలో క్రింద సూచించబడిన అంశాల్లో తమ మరియు ఇతర ముస్లిం విద్యార్థుల, యువకుల జీవితాలను తీర్చిదిద్దేందుకు కృషి చేయాలి:

- జీవితాన్ని అన్ని రకాల చెడుగుల నుంచి పవిత్రంగావించడం.
- జీవితాన్ని ఇస్లామీయ బోధనలకు అనుగుణంగా మలచడం.
- ఫర్జ్, నఫిల్ నమాజుల ఆచరణ, పవిత్ర ఖుర్‌ఆన్ పఠనం, ప్రార్థనలు, దైవనామ స్మరణ మొదలయినవాటిని క్రమం తప్పకుండా ఆచరించడం.
- మంచివారి సన్నిధిలో గడపడం.
- దైవమార్గంలో డబ్బు ఖర్చుచేయడం.
- ఇస్లామీయ సందేశ ప్రచారం కొరకు కృషి చేయడం.
- సామర్థ్యాలను పెంపొందించుకోవడం.
- శుచి, శుభ్రత మరియు ఆరోగ్యాల విషయంలో ఉన్నత ప్రమాణాలను పాటించడం.
- విద్యాప్రమాణాలను పెంపొందించుకోవడం.
- ఇస్లామీయ లక్ష్యాల సిద్ధికై ఉద్యమంతో గాఢమైన అనురక్తిని, అభిమానాన్ని, బాంధవ్యాన్ని కలిగియుండడం.
- సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం.
- ఆత్మపరిశీలన చేసుకోవడం.

సంస్కరణాత్మక కార్యక్రమాలు (తజ్‌కియహ్ ప్రోగ్రాములు) విజయవంత మయ్యేందుకై అన్నిరకాల రిజర్వేషన్లు (Reservations), కట్టుబాట్లు (Bindings), అడ్డంకులు(Barriers) మొదలయిన వాటికి అతీతమైన, పవిత్రమైన, స్వేచ్ఛాయుతమైన వాతావరణంలో కార్యక్రమాలు నిర్వహించబడటం తప్పనిసరి. ఇటువంటి వాతావరణం ఒకవేళ కాలేజీలో ఉన్నట్లయితే అక్కడే కార్యక్రమాలను నిర్వహించాలి. ఒకవేళ ఇటువంటి వాతావరణం లభించనట్లయితే విద్యాలయాల్లో విద్యార్థులతో సంబంధాలను ఏర్పరచుకొని విద్యార్థులకు అనువయిన, సౌలభ్యంతో కూడిన ప్రదేశంలో కార్యక్రమాలను నిర్వహించాలి.

సంస్కరణాత్మక కార్యక్రమాలను (తజ్‌కియహ్ ప్రోగ్రాములు) క్రింద చూపబడిన రీతిలో వర్గీకరించవచ్చు:

(1) స్థిరమైన తజ్‌కియహ్ ప్రోగ్రాములు.

(2) తాత్కాలికమైన తజ్‌కియహ్ ప్రోగ్రాములు.

(3) వైజ్ఞానిక కార్యక్రమాలు మరియు సామర్థ్యాలను పెంపొందించే సాధనాలు.

## స్థిరమైన తజ్‌కియహ్ ప్రోగ్రాములు

ఈ కార్యక్రమాలు విజయవంతమైనప్పుడే తజ్‌కియహ్ యొక్క లక్ష్యం సాధించబడుతుంది. దీనిమీదే సంస్థ యొక్క విజయం సైతం ఆధారపడి వుంది. కాబట్టి ఈ కార్యక్రమాలు నిజమైన స్పిరిట్‌తో నిర్వహించబడాలి, సరయిన సమయంలో నిరంతరాయంగా నిర్వహించబడుతూ ఉండాలి. అలాగే పూర్తి మేధస్సుతో వాటికి సంబంధించిన ప్రణాళికలను రూపొందించాలి. ఈ విషయాలను కార్యక్రమాల నిర్వహణ విషయంలో తప్పనిసరిగా గుర్తుంచుకోవాలి.



7

# వారాంతపు సమావేశం

ఇది అన్నిటికంటే ముఖ్యమైన కార్యక్రమం. ఏదయినా విద్యాలయంలో లేదా విద్యార్థి వర్గంలో సంస్థకు విజయం చేకూరాలంటే ఈ కార్యక్రమాన్ని క్రమం తప్పకుండా, స్థిరంగా, ప్రయోజనాత్మకంగా మరియు ప్రభావవంతంగా నిర్వహించడం ఎంతో అవసరం.

**లక్ష్యాలు**

◈ క్రమబద్ధంగా విద్యార్థుల మనోవైఖరులను తీర్చిదిద్దుతూ వారిలో సమతుల్యమైన ఉద్యమస్ఫూర్తిని జనింపజేయడం.

◈ వారి అభిరుచులను పెంపొందింపజేసి ఇస్లామీయ ఆచరణలో మరియు ఇస్లామీయ పునరుజ్జీవనానికై జరుగుతున్న కృషిలో పాలుపంచుకునేలా వారిలో చైతన్యాన్ని (Motivation) రగిలించడం.

◈ ఇస్లామీయ పునరుజ్జీవనానికై జరుగుతున్న ఉద్యమంలో చైతన్యవంతమైన పాత్రను నిర్వహించేలా, వారి వ్యక్తిత్వ వికాసానికి దోహదపడే సూచనలను, దిశను, మార్గ నిర్దేశకత్వాన్ని మరియు ఆచరణాత్మక చైతన్యాన్ని వారికి అందించడం.

◈ వారిలో సామూహికత్వపు (ఇజ్‌తిమాయియత్) చైతన్యాన్ని, దాని తీరుతెన్నులను జనింపజేయడం, ఎస్.ఐ.ఓ. ఆశయాలు, లక్ష్యాలు, పాలసీ, కార్యాచరణ విధానం, ఆహ్లాదకరమైన సామూహిక వాతావరణం మొదలయినవాటితో కూడిన ప్రభావాలను వారిలో కలగజేసి తద్వారా వారు అల్లాహ్ మార్గంలో కృషి చేసేందుకు దోహదపడాలి.

**విజయవంతమైన వారాంతపు సమావేశపు ప్రత్యేకతలు :**

❑ పూర్తిగా సిద్ధమయి వుండాలి. సమయానికి ముందే ప్రణాళికను రూపొందించుకోవాలి. పబ్లిసిటీ జరగాలి. వీలయినంత ఎక్కువ మంది విద్యార్థులు సమావేశంలో పాల్గొనేలా పటిష్ఠవంతమైన కృషి జరగాలి. సంబంధిత సంస్థకు లేదా ఊరికి చెందిన విద్యార్థులందరూ సమావేశంలో పాల్గొనగలిగేలా ప్రయత్నాలు జరగాలి.

- కార్యక్రమానికి చెందిన అంశాలు ఆసక్తికరంగా ఉండాలి. వాటి ద్వారా విద్యార్థులకు సర్వతోముఖ శిక్షణ అందాలి. అన్నివిధాలా సకారాత్మక రీతిలో వారి మనోవైఖరులు రూపొందాలి.
- కార్యక్రమ అంశాలే కాకుండా వాటిని సమర్పించే శైలి (Mode of Presentation) మరియు సాధనాలు కూడా ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా ఉండాలి. దృశ్యోపకరణాలను {(Visual Aids) ఉదాహరణకు ప్రొజెక్టర్, చిత్రాలు, ఛార్ట్‌లు, చిత్రపటాలు, పట్టికలు, నమూనాలు మొదలయినవి} పూర్తిగా వినియోగించాలి.
- సమావేశంలో వీలయినంత ఎక్కువ మంది హాజరయ్యేలా చూడాలి.
- విద్యార్థులకు కేవలం క్రొత్త క్రొత్త విషయాలను తెలపడం మరియు వారి ఆలోచనాపటిమను అభివృద్ధిపరచడమే కాకుండా ఆచరణాత్మక చైతన్యాన్ని సైతం వారిలో రగిలించడం కార్యక్రమం యొక్క లక్ష్యం కావాలి. కార్యక్రమంలో అత్యంత ప్రభావవంతమైన మాటలు, వారిలో చైతన్యాన్ని ఉద్దీపింపజేసి వారి హృదయాల్లో అలజడినిరేపే విప్లవాత్మకమైన మాటలు సైతం ఉండాలి.
- సమావేశంలో అనురాగం, ఆప్యాయత మరియు పవిత్రతలతో కూడిన ప్రేమ పూర్వక వాతావరణం ఉండాలి. ఏ క్రొత్త వ్యక్తి అయినా అపరిచిత వాతావరణాన్ని ఫీల్ కావడానికి బదులు ఒక విధమైన సుపరిచిత వాతావరణాన్ని, ఆకర్షణీయమైన పరిసరాలను అనుభూతి చెందాలి. ఒక్కమాటలో చెప్పాలంటే సంవత్సరాలుగా ఆ వాతావరణంతో పరిచయాన్ని కలిగియున్నవానిగా అతడు అనుభూతి చెందాలి.

**ఈ ప్రత్యేకతలను ఎలా జనింపజేయగలం?**

- కనీసం వారం రోజులు ముందుగానే సమావేశానికి సంబంధించిన పథక రచన (Planning) చేసుకోవాలి. సమావేశంలో పాల్గొనేవారి నుంచి కూడా సలహాలు స్వీకరించాలి.
- సమావేశం యొక్క అంశాలను (Topics) నిర్ణయించేటప్పుడు ఖుర్‌ఆన్ మరియు హదీసులను దృష్టిలో ఉంచుకోవాలి, ఇస్లామీయ చింతన పురోభివృద్ధి, ఉద్యమం

మరియు సందేశాలకు సంబంధించిన స్పృహ, తత్కాల పరిస్థితుల పట్ల అవగాహన, సాధారణ అంశాలన్నింటి పరిజ్ఞానం (General Knowledge) మరియు చైతన్యాన్ని ప్రోదిచేసే మాటలు మొదలయినవన్నీ సమతుల్యంగా ఉండేలా చూడాలి.

- క్రొత్త క్రొత్త సాధనాలను, అంశాలను ఉపయోగించుకోవాలి. అందుకుగాను మంచి సృజనాత్మకమైన సలహాలను ఆహ్వానించాలి.
- ఆహ్వానించబడినవారికి సైతం సమావేశంలో మాట్లాడే అవకాశాన్ని ఇవ్వాలి. క్రొత్తగా హాజరయినవారు ఒకవేళ మొట్టమొదటిసారిగా ఇస్లామీయ అంశాలపై మాట్లాడే సామర్థ్యాన్ని కలిగియుండనట్లయితే వారికి నచ్చిన అంశంపై మాట్లాడేలా వారిని ప్రోత్సహించాలి. ఉదాహరణకు కంప్యూటర్ సైన్స్ విద్యార్థిని ఆ రంగంలో జరిగిన సరిక్రొత్త అభివృద్ధిని గురించి మాట్లాడేలా ప్రోత్సహించాలి. క్రీడారంగంలో ఆసక్తి గల విద్యార్థిని క్రీడారంగానికి సంబంధించిన అంశంపై మాట్లాడమని చెప్పాలి.
- మన సంబంధీకులకు ఆకర్షణీయమైన రీతిలో సమాచారాన్ని సమర్పించే విధానాల గురించి తర్ఫీదు ఇవ్వాలి. అంటే దృశ్యోపకరణాలను (Visual Aids) వినియోగించే విధానాలలో శిక్షణ ఇవ్వాలి. అలాగే చతురతతో, సమయోచితంగా, హృదయాలను హత్తుకునే రీతిలో సంభాషించే విషయంలో, సమావేశ వాతావరణాన్ని ఆసక్తికరంగా మలిచే విషయంలో శిక్షణ ఇవ్వాలి.
- సమావేశంలో పాల్గొనేవారికి హృదయపూర్వకంగా స్వాగతం పలకాలి. ప్రేమ పూర్వ కంగా వారితో మాట్లాడాలి. వారిని ప్రోత్సహించాలి. సంవత్సరాల తరబడి గాఢమైన స్నేహాన్ని కలిగియున్న రీతిలో వారితో మెలగాలి.

అంశాల జాబితా, సాధనాల జాబితా, నమూనా కార్యక్రమాల జాబితా మొదలయిన వాటి కొరకు పుస్తకం చివర ఇవ్వబడిన అనుబంధంలో చూడండి.



8

# నిజాముల్ ఉస్రహ్

నిజాముల్ ఉస్రహ్ అనేది సంస్థ సంబంధీకుల మరియు ఇతర ముస్లిం విద్యార్థుల శిక్షణ కొరకు రూపొందించబడిన ఒక ప్రభావవంతమైన కార్యక్రమం. విద్యాలయాల్లో, హాస్టళ్ళల్లో, విద్యార్థుల వసతి గృహాల్లో సైతం ఈ కార్యక్రమాన్ని సులువుగా కొనసాగించవచ్చు. హాస్టళ్ళల్లో దీని స్థాపన ఎంతో సులభమైనదేకాక ప్రయోజనకరమైనది కూడా. ఏ విద్యాలయంలో లేదా హాస్టల్‌లోనయితే సంస్థ వేళ్ళూనుకొని చెప్పుకోదగ్గ సంఖ్యలో విద్యార్థులు మనతో సంబంధాలను కలిగియున్నారో అక్కడ నిజాముల్ ఉస్రహ్‌ను తప్పనిసరిగా స్థాపించేందుకై కృషి చేయాలి.

స్టడీ సర్కిల్ అనేది నిజాముల్ ఉస్రహ్‌లో అంతర్భాగమే. అయితే అవసరాని కనుగుణగా దానిని విడిగా కూడా నిర్వహించవచ్చు. మన పాలసీ ప్రోగ్రామ్‌లో ఇవ్వబడిన నిజాముల్ ఉస్రహ్ యొక్క నమూనా ఇక్కడ కూడా పొందుపరచబడుతోంది.

**నిజాముల్ ఉస్రహ్ నమూనా**

- తజ్కియహ్ గైడ్ (వ్యక్తిగత శిక్షణా కార్యక్రమాల మార్గదర్శి)కు ఆచరణాత్మక రూపాన్ని ఇచ్చేందుకై ప్రతి యూనిట్ మరియు సర్కిల్‌లో నిజాముల్ ఉస్రహ్ స్థాపించబడాలి. అందుకుగాను వ్యక్తులతో కూడిన సమూహాలు రూపొందించ బడతాయి. వాటిలో ప్రతి ఒకదానిని 'ఉస్రహ్' అంటారు.
- ప్రతి ఉస్రహ్ (గ్రూప్) లోనూ కనిష్ఠంగా ఇద్దరు వ్యక్తులు, గరిష్ఠంగా ఐదుగురు వ్యక్తులు ఉంటారు. అయితే ముగ్గురితో కూడిన సమూహమే ఆదర్శనీయమైనదిగా పరిగణించబడుతుంది.
- ప్రతి ముస్లిం విద్యార్థిని లేదా యువకుడిని ఉస్రహ్ (గ్రూప్) లో చేర్చుకోవచ్చు.
- ప్రతి సభ్యుడూ మరియు ప్రతి చురుకైన అసోసియేట్ వేర్వేరుగా తమ ఉస్రహ్‌లను ఏర్పరచుకోవాలి.
- సంస్థకు చెందినవారు స్వభావాన్ని, సౌలభ్యాలను దృష్టిలో ఉంచుకొని తమ తమ నిజాముల్ ఉస్రహ్‌లను స్థాపించుకోవాలి.

- ప్రతి ఉస్‌రహ్‌కూ ఒక లీడర్ ఉండాలి. అతడు సంస్థ సభ్యుడు లేదా చురుకైన అసోసియేట్ అయి ఉంటాడు.
- ప్రాంతీయ స్థాయిలో స్థానిక అధ్యక్షుడు లేదా తజ్‌కియహ్ బాధ్యుడు అప్పుడప్పుడూ ఆచరణాత్మకంగా ప్రతి ఉస్‌రహ్‌లోనూ పాల్గొంటూ వాటి కార్యకలాపాల పట్ల ప్రత్యక్ష అవగాహనను కలిగియుండి సముచితమైన మార్గనిర్దేశనంగావిస్తుంటాడు.
- ప్రతి ఉస్‌రహ్ రోజుకు ఒకసారి వీలునుబట్టి ఒకచోట సమావేశమవుతుంది. ఉస్‌రహ్ యొక్క సమావేశం ఒక నిర్ణీత సమయంలో ఏదో ఒకచోట జరగవచ్చు. సౌలభ్యాని కనుగుణంగా క్లాసుల మధ్య దొరికే విరామ సమయాల్లో, షికారుకు వెళ్ళిన సమయంలో, నమాజులకు ముందు దొరికే స్వల్ప సమయంలో కూడా ఉస్‌రహ్ కార్యక్రమాన్ని నిర్వహించుకోవచ్చు.
- తజ్‌కియహ్ గైడ్‌లోని, సామూహికంగా స్థాపించబడే మూడు కార్యక్రమాలు క్రింద పేర్కొనబడుతున్నాయి:

  (1) స్పష్టమైన ఉచ్చారణతో (తజ్‌వీద్ శాస్త్రంతో) పవిత్ర ఖుర్‌ఆన్‌ను పఠించడం.

  (2) ఖుర్‌ఆన్‌ను కంఠస్థం చేయడం, కంఠస్థం చేయబడిన ఖుర్‌ఆన్ వాక్యాలను తజ్‌వీద్ ప్రకారం సరిచేసుకోవడం.

  (3) వివిధ దుఆలను, హదీసులను కంఠస్థం చేయడం.
- ఉస్‌రహ్ సభ్యులు తమ సౌలభ్యాన్ని బట్టి కనీసం నెలకొకసారయినా దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స) గారి సున్నత్ ప్రకారం ఉపవాసముండాలి.
- మస్‌జిద్ సేవ మరియు జమాఅత్ పనుల్లో ఒకరికొకరు సహకరించుకోవాలి.
- తజ్‌కియహ్ గైడ్ వెలుగులో తజ్‌కియహ్ (సంస్కరణ) కు సంబంధించిన కార్య క్రమాలన్నింటి విషయంలో అందరూ పరస్పరం ప్రక్షాళన చేసుకోవాలి. వారానికొక సారి తజ్‌కియహ్ గైడ్‌ను సామూహికంగా అధ్యయనం చేసి దాని వెలుగులో ఆత్మపరిశీలన చేసుకోవాలి.



9

# శిక్షణా సమావేశం

సభ్యుల మరియు అసోసియేట్ల శిక్షణ కొరకు శిక్షణా సమావేశం ఎంతో ఆవశ్యకమైనది మరియు ప్రాముఖ్యత గలది. వారాంతపు సమావేశం యొక్క ప్రయోజన మేమిటంటే దానివల్ల తరచుగా, క్రమం తప్పకుండా మాటిమాటికీ ఆవశ్యక అంశాల పునశ్చరణ, స్మరణ, ప్రస్తావన మొదలయినవి జరుగుతూ ఉంటాయి. కానీ ఈ క్లుప్తమైన కార్యక్రమం వల్ల మనోవైఖరులు తీర్చిదిద్దబడటం మరియు శిక్షణగరపడం అనేవి ప్రభావవంతమైన రీతిలో కాజాలవు. శిక్షణా సమావేశం ఈ లోటును తీరుస్తుంది. దీని ద్వారా ప్రజల విజ్ఞానం కూడా అభివృద్ధి చెందుతుంది. వారి చింతనాసామర్థ్యం మరియు చైతన్యాల శిక్షణ కూడా కొనసాగుతుంది. అలాగే తమ సామర్థ్యాలను అభివృద్ధి పరుచు కునేందుకు వారికి అవకాశాలు కూడా లభిస్తాయి.

వారాంతపు సమావేశం యొక్క ప్రత్యేకతలన్నీ శిక్షణా సమావేశంలోనూ ఉండాలి. శిక్షణా సమావేశం యొక్క కొన్ని ప్రత్యేక లక్షణాలు క్రింద పొందుపరచబడుతున్నాయి :

☑ వారాంతపు సమావేశం యొక్క ప్రోగ్రామింగ్‌ను మరియు దానిలోని అంశాలను సాధారణ ముస్లిం విద్యార్థుల మానసిక స్థాయిని, ఆసక్తులను దృష్టిలో ఉంచుకొని రూపొందించాలి. వారే దాని సంబోధితులు కూడా అవుతారు. అయితే శిక్షణా సమావేశం అనేది వాస్తవానికి సంస్థ యొక్క సభ్యులు మరియు అసోసియేట్ల కొరకు ఉద్దేశించబడి ఉంటుంది. కాబట్టి దాని ప్రోగ్రామింగ్‌లో అందరి అవసరాలను దృష్టిలో ఉంచుకోవడం జరుగుతుంది. ప్రోగ్రామింగ్ అనేది ప్రతి సభ్యుడూ లేదా అసోసియేట్ తన ప్రస్తుత స్థాయికంటే ఉన్నతంగా ఎదిగేందుకు దోహదపడేలా ఉంటుంది.

☑ శిక్షణా సమావేశం ఒక రోజంతా ఏదయినా క్యాంప్ రూపంలో నిర్వహించబడడమే ప్రయోజనకరమైన అత్యుత్తమ విధానం. ఒకవేళ అది సాధ్యంకానట్లయితే సమావేశం కనీసం 5 గంటలపాటయినా కొనసాగాలి.

☑ శిక్షణా సమావేశంలో సమర్పించబడే కార్యక్రమాలు ప్రత్యేకమైన ఏర్పాట్ల ద్వారా పూర్తి తయారీతో సమర్పించబడాలి. కనీసం 20 రోజుల ముందే ప్రోగ్రాముకు సంబంధిం చిన వివరాలు ఇవ్వబడతాయి. సమావేశంలో పాల్గొనబోయేవారు

మరియు ప్రసంగీకులు పూర్తి తయారీతో, అన్ని ఏర్పాట్లతో సమావేశంలో పాల్గొంటారు.

ప్రామాణికమైన శిక్షణా సమావేశాల ద్వారా ఈ క్రింది అంశాల ప్రాతిపదికన సమావేశంలో పాల్గొనేవారి శిక్షణ క్రమబద్ధంగా కొనసాగాలి :

☑ అల్లాహ్‌తో గాఢమైన సంబంధం, ఆరాధనల పట్ల ఉత్సాహం, మానసిక పవిత్రత, సత్కార్యాలు చేసే మరియు పాపాలకు దూరంగా ఉండే మనోవైఖరి, దైవభీతి, స్వర్గ కాంక్ష, నరకం నుంచి రక్షించబడాలనే తపన.

☑ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స) పట్ల అవ్యాజమైన ప్రేమ, ఆయన (స) ఔన్నత్యం గురించిన స్పృహ, ఆయన (స) ను అనుసరించడం పట్ల ఆసక్తి మరియు ఉత్సాహం.

☑ ఇస్లాం పట్ల నిజమైన అవగాహన, స్పృహ, దాని గురించిన విస్తృతమైన చైతన్యభరితమైన భావన, ధర్మబద్ధమైన (హలాల్) మరియు ధర్మవిరుద్ధమైన (హరామ్) విషయాల గురించిన విచక్షణాజ్ఞానం.

☑ ఉద్యమం మరియు దాని లక్ష్యాల స్పృహ, ఇస్లామీయ ఉద్యమం యొక్క ప్రత్యేకతల పట్ల అవగాహన, దాని అంతర్భూత తత్వావగాహన, సామూహిక జీవితపు స్పృహ మరియు సామూహిక జీవనసరళి.

☑ అల్లాహ్ మార్గంలో కృషి చేసే కాంక్ష, త్యాగం చేసే తపన, సంస్థ పట్ల అనురాగం, ఇస్లామీయ ఆత్మాభిమానం మరియు ఇతర పవిత్ర భావావేశాలు.

☑ సంస్థలో పనిచేసే విధానం, ఇస్లామీయ సందేశానికి సంబంధించిన రీతులు, నాయకత్వపు లక్షణాల తర్ఫీదు, వ్యక్తిత్వ వికాసం.

☑ జ్ఞానపిపాస, అధ్యయనం పట్ల ఆసక్తి, తన సామర్థ్యాన్ని గుర్తించి దానిని పెంపొందించుకోవడం పట్ల తపన.

☑ పరిస్థితుల పట్ల సునిశితమైన దృష్టి , సాధారణాంశాల పరిజ్ఞానం (General Knowledge), ఇంగిత జ్ఞానం (Common Sense), విజయవంతమైన, బుద్ధిమంతు డయిన వ్యక్తిగా రూపొందించే ప్రయత్నం.

- ☑ ఖుర్ఆన్‌తో ప్రత్యేకమైన సంబంధం, దానిని అర్థం చేసుకోవాలనే జిజ్ఞాస మరియు కాంక్ష, ఖుర్ఆన్ విషయంలో ఆవశ్యకమైన అంశాల అవగాహన.
- ☑ ఇస్లామీయ చరిత్ర పట్ల తప్పనిసరి అవగాహన.

ఈ లక్ష్యాల సాధనకై అవసరానికనుగుణంగా కొన్ని ఆచరణలు (ఉదాహరణకు జాగరణ, ఆచరణాత్మక అభ్యాసం మొదలయినవి) కూడా సూచించబడవచ్చు.



10

# ఇస్లామీయ గ్రంథాలయం

ప్రతి క్యాంపస్ యూనిట్‌లోనూ ఇస్లామీయ గ్రంథాలయాన్ని (లైబ్రరీ) నిర్వహించడం తప్పనిసరి. ఒకవేళ హాస్టల్‌లోని ఏదయినా గదిలో పద్ధతి ప్రకారం లైబ్రరీ నడిపే వీలుంటే మంచిది. ఎవరయినా ఒక విద్యార్థి వద్ద ఉండే బ్యాగ్‌ను ఉపయోగించి మొబైల్ లైబ్రరీని (సంచార గ్రంథాలయం) నిర్వహించవచ్చు. ఇంటర్వెల్ సమయంలో ఒక ప్రదేశాన్ని మరియు వ్యవధిని నిర్ణయించుకొని అక్కడ పుస్తక ప్రదర్శనను కొనసాగించ వచ్చు.

ఒక క్యాంపస్ లైబ్రరీలో 100 ప్రాథమిక గ్రంథాలు మరియు బుక్‌లెట్లు (చిన్న పుస్తకాలు) తప్పనిసరిగా ఉండాలి. విద్యార్థుల సౌలభ్యం మేరకు ఇంగ్లీషు, ఉర్దూ మరియు ప్రాంతీయ భాషల్లో పుస్తకాలను వారికి అందించాలి.

కాలేజీ పరిస్థితులకనుగుణంగా సముచితమైన విధానాన్ని అవలంబించి కాలేజీ విద్యార్థుల్లో లైబ్రరీ గురించి ప్రచారం చేయాలి.



# 11

# క్లాస్

విద్యార్థులను, ముఖ్యంగా తెలివయిన, సమర్థులయిన విద్యార్థులను సంస్థకు చేరువ చేయడానికి అనేక చోట్ల ఇది (క్లాస్) ఎంతో ప్రభావవంతమైన సాధనంగా నిరూపితమయింది. తెలివయిన, ప్రతిభావంతులయిన విద్యార్థులు వీలయినన్ని ఎక్కువ శాస్త్రాలను, కళలను నేర్చుకోవడం పట్ల ఆసక్తిని కనబరుస్తారు. ఒకవేళ వారికి తగినన్ని అవకాశాలను కల్పించినట్లయితే వారు సంస్థకు సులభంగా చేరువవుతారు. అప్పుడు ఈ తరగతుల ద్వారా ప్రతిరోజూ వారిని కలసుకోవడం, లెక్చర్‌కు సంబంధించిన విషయాల ద్వారా వారి మనోవైఖరులను తీర్చిదిద్దే మహత్తరమైన అవకాశాలు లభిస్తాయి.

ఏదేని కాలేజీ/హాస్టల్ లేదా విద్యార్థులు నివసించే రూములకు సమీపంలో అనువయిన స్థలాన్ని ఎంచుకొని ఏదేని అంశంలో లేదా విద్యలో తత్సంబంధిత ప్రవీణుడి సేవలను వినియోగించుకుంటూ క్రింద తెలుపబడిన వాటిలో ఏదో ఒక క్లాసును నిర్వహించ వచ్చు.

- తజ్‌వీద్ క్లాస్ (ఖుర్ఆన్ ఉచ్చారణాశాస్త్రం)
- అరబీ క్లాస్
- ఉర్దూ క్లాస్
- ప్రాంతీయ భాష/సంస్కృత భాషలపై క్లాసులు.
- ఎవరయినా ఇస్లామీయ ధార్మిక పండితునిచే ఖుర్ఆన్ వ్యాఖ్యానం (తఫ్‌సీర్), ఇస్లామీయ ధర్మశాస్త్రం (ఫిఖహ్) మరియు హదీసులకు సంబంధించిన క్లాసులు.



12

# సామూహిక నమాజ్ పట్ల శ్రద్ధ

ఒకవేళ కాలేజీకి దగ్గరలో ఏదయినా మస్జిద్ ఉన్నట్లయితే దానికి సంబంధించిన వ్యవహారాల్లో సంస్థ సంబంధీకులు ఆసక్తి చూపాలి. అంతేగాకుండా జమాఅత్‌తో కలసి సామూహిక నమాజ్ (నమాజె బా జమాఅత్) ఆచరించేందుకై మస్జిద్‌కు వెళ్తూ ఉండాలి. మస్జిద్ ద్వారానే ముస్లిం విద్యార్థులకు చేరువై వారిని ప్రభావితం చేయడం సులువవుతుంది.

ఒకవేళ కాలేజీకి దగ్గరలో మస్జిద్ లేనట్లయితే ఏదయినా హాస్టల్ రూములో, కాలేజీ గ్రౌండ్‌లో, క్లాస్ రూములో, ల్యాబ్‌లో లేదా బిల్డింగ్ పైభాగంలో లేదా క్యాంటీన్‌లో ఎక్కడ వీలయితే అక్కడ సామూహికంగా నమాజ్‌ను ఆచరించేందుకు ప్రయత్నించాలి. నమాజ్ తర్వాత రెండు లేదా మూడు నిమిషాలపాటు 'తజ్కిర్' (చిన్న ప్రసంగం), చేయడం ద్వారా విద్యార్థుల మనోవైఖరులను తీర్చిదిద్దవచ్చు.



13

# క్యాంపెయిన్స్

ముస్లిం విద్యార్థుల మరియు యువకుల సంస్కరణ కొరకు వివిధ క్యాంపెయిన్స్ కూడా నిర్వహించవచ్చు. అటువంటి కొన్ని క్యాంపెయిన్‌ల నమూనాలు క్రింద ఇవ్వబడ్డాయి.

* సంస్కరణా వారోత్సవం
* నమాజ్ సప్తాహం
* పర్సనల్ లైబ్రరీ వారోత్సవం
* పాలస్తీనా జాగృతి ఉద్యమం
* నైతిక విలువల పునరుద్ధరణ వారోత్సవం
* మంచి వైపునకు ఆహ్వానం మరియు చెడుల నిర్మూలనా వారోత్సవం
* విద్యాప్రమాణాల వారోత్సవం

వీటిలో కొన్ని క్యాంపెయిన్లను సందేశాత్మక లక్ష్యాల సాధన నిమిత్తమూ నిర్వహించవచ్చు, మరికొన్నింటిని సంస్కరణ మరియు సందేశ ప్రచారాల ఉమ్మడి లక్ష్యాల సాధన కొరకు కూడా నిర్వహించవచ్చు. ఒకవేళ ఈ క్యాంపెయిన్లు విద్యార్థులు నివసించే ప్రాంతాల్లో లేదా ముస్లిం విద్యార్థులు ఎక్కువగా ఉండే కాలేజీల్లో లేదా హాస్టళ్ళల్లో నిర్వహించబడుతున్నట్లయితే సముచితమైన ప్రచార సాధనాలను వినియోగించవచ్చు. అలా కానట్లయితే సాధారణంగా పరిచయాల ద్వారా, సంబంధాల ద్వారా లేదా చిన్న చిన్న మీటింగుల ద్వారా విస్తృత స్థాయిలో సందేశాన్ని అందజేసే ప్రయత్నం చేయడం ఉత్తమం.



క్యాంపెయిన్ లేదా ఉద్యమం యొక్క అంశాన్ని (Theme) చాలా ముందుగానే నిర్ణయించుకోవాలి. అంశంతోపాటు క్యాంపెయిన్ కార్యక్రమం, దాని లక్ష్యాలు, దాని ద్వారా ఎటువంటి సందేశాన్ని అందజేయాలనుకుంటున్నారు? ఇత్యాది విషయాలన్నీ విపులంగా నిర్ణయించుకోవాలి.

- అంశం మరియు దాని సందేశంపై మన క్యాడర్‌కు సమయానికి ముందే మంచి శిక్షణ ఇవ్వాలి. అందుకుగాను ప్రత్యేకమైన ట్రైనింగ్ క్యాంపును నిర్వహించాలి. అధ్యయనం కొరకు ప్రత్యేక లక్ష్యాలను వారికి ఇవ్వాలి. స్టడీ సర్కిళ్ళను నిర్వహించాలి. స్టడీ కిట్స్ (Study Kits)లను వారికి అందించాలి.
- క్యాంపెయిన్‌లో లేదా ఉద్యమంలో మన సంస్థ క్యాడర్‌ను మాత్రమే కాకుండా సంస్థ ఆశయాలు మరియు లక్ష్యాలతో ఏకీభవించకపోయినప్పటికీ మనం నిర్వహించే క్యాంపెయిన్ లక్ష్యాలతో ఏకీభవించే బయటి విద్యార్థులను, యువకులను మనతో కలుపుకొని క్యాంపెయిన్ కార్యక్రమాల్లో ఉపయోగించుకోవాలి.



# కాన్ఫరెన్స్ - కన్వెన్షన్

కాన్ఫరెన్సులు/కన్వెన్షన్లు విద్యార్థులను సంబోధించడానికి దోహదపడే అతిముఖ్యమైన, ప్రభావవంతమైన సాధనాలు. కన్వెన్షన్ల ద్వారా విద్యార్థుల మనోవైఖరులను కూడా తీర్చిదిద్దవచ్చు. సంస్థ మరియు దాని సందేశాలను విస్తృత స్థాయిలో పరిచయం చేయవచ్చు. సంస్థ యొక్క శక్తిసామర్థ్యాలు, విస్తృతి, ప్రభావశీలత మొదలయినవాటితో కూడిన ఆహ్లాదకరమైన వాతావరణాన్ని రూపొందించవచ్చు. అలాగే విద్యార్థుల్లో సంస్థ మరియు దాని కార్యకలాపాలకు సంబంధించిన చైతన్యాన్ని రగుల్కొల్పవచ్చు.

ఎప్పుడయితే మనం నిర్వహించబోయే కన్వెన్షన్‌లో లేదా కాన్ఫరెన్స్‌లో క్రింద తెలుపబడిన లక్షణాలు ఉంటాయో అప్పుడే మనకు పైన పేర్కొనబడిన ప్రయోజనాలు ప్రాప్తమవుతాయి.

- కన్వెన్షన్‌ను ఏదయినా కాలజీ లేదా హాస్టల్ స్థాయిలో తత్సంబంధిత విద్యార్థుల కొరకు నిర్వహించవచ్చు లేదా పట్టణ/జిల్లా/ప్రాంతీయ/రాష్ట్ర స్థాయిలో కూడా విద్యార్థులందరి కొరకు నిర్వహించవచ్చు.
- కన్వెన్షన్ కేవలం విద్యార్థుల కొరకు మాత్రమే నిర్వహించబడాలి. విద్యార్థులు మాత్రమే దాని సంబోధితులయి ఉండాలి. వారికే సందేశమివ్వాలి. వారిలోనే ప్రచారం జరగాలి. పాల్గొన్నవారిలో 80 శాతానికి మించి విద్యార్థులు ఉండేలా చూడాలి.
- కాన్ఫరెన్స్ లేదా కన్వెన్షన్ పేరుతో పెద్ద గుంపును సమీకరించుకోవడం (అందులో విద్యార్థుల భాగస్వామ్యం చెప్పుకోదగినంతగా లేకపోవడం) వల్ల విద్యార్థుల్లో పని చేయడానికి సంబంధించిన లక్ష్యాలకు తగినంత బలం చేకూరకపోగా దాని ఫలితంగా విద్యార్థులతో కూడియుండే ఎస్. ఐ. ఓ. ముఖచిత్రం ప్రభావితమవుతుంది.
- కాన్ఫరెన్స్ యొక్క అంశం (Theme), ప్రచారానికి సంబంధించిన కార్యా చరణ విధానం, ఏ మౌలిక విషయాల ప్రాతిపదికన కాన్ఫరెన్స్‌ను పరిచయం చేయాలి? ఎటువంటి సమస్యలను (Issues) లేవనెత్తాలి? - ఈ విషయాలన్నీ నిర్ణయించ

బడాలి. అవి విద్యార్థుల నైజం మరియు వారి ప్రస్తుత అవసరాలకు అనుగుణంగా ఉండాలి.

- కాన్ఫరెన్స్ యొక్క కార్యక్రమం ఆసక్తికరంగా, ప్రభావవంతంగా, ఆకర్షణీయంగా ఉండాలి. శుష్క ప్రసంగాలు, పాతబడిపోయిన అంశాలకు సంబంధించిన ప్రసంగాలు అందులో ఉండరాదు. విద్యార్థుల నడుమ గడిపి, వారి నైజాన్ని గుర్తెరిగి, వారికి అర్థమయ్యే శైలిలోనే మాట్లాడే చాతుర్యంగల ప్రసంగీకులను మాత్రమే ఎంపిక చేసుకోవాలి. అంటే సైద్ధాంతిక మరియు తాత్విక అంశాలతోపాటు విద్యార్థుల అవసరాలకు సంబంధించిన అంశాలు కూడా కార్యక్రమంలో ఉండాలి.

- కన్వెన్షన్ యొక్క పబ్లిసిటీ కొరకు సుప్రసిద్ధ ప్రచార సాధనాలతో పాటు ముఖ్యంగా Hand made posters, Street playes, Collar pins మొదలైన క్రొత్త క్రొత్త సాధనాలను సైతం వినియోగించడం పట్ల శ్రద్ధ చూపాలి.

- కన్వెన్షన్ పనులన్నింటిలోనూ, ప్రోగ్రామ్‌లోనూ వీలునుబట్టి విద్యార్థులందరికీ పాల్గొనే అవకాశమివ్వాలి.

- విద్యార్థులు కన్వెన్షన్‌ను తమదిగా భావించే విధంగా కన్వెన్షన్ యొక్క వాతావరణాన్ని రూపొందించాలి. వారికి అక్కడ ఎటువంటి ఆటంకాలూ, ఇబ్బందులూ ఎదురవ కూడదు. వేదిక మీద కూడా విద్యార్థులే ఉండాలి. నిర్వాహకులు కూడా విద్యార్థులే అయి ఉండాలి. అలాగే పాల్గొనేవారు కూడా విద్యార్థులే అయి ఉండాలి. పెద్దల మార్గనిర్దేశకత్వాన్ని, సహకారాన్ని తప్పనిసరిగా తీసుకోవాలి. కానీ బాహ్యంలో ప్రతిచోటా విద్యార్థులే కనబడాలి.

- కన్వెన్షన్‌లో ప్రసంగాలు, ప్రోగ్రాములే కాకుండా సాంస్కృతిక ప్రదర్శనలు (Cultural shows), ఎడ్యుకేషనల్ గైడెన్స్ సెల్ మొదలయినవి కూడా తప్పనిసరిగా ఉండాలి. ఆ విద్యార్థులకు ప్రోగ్రామ్‌లో పాల్గొని తమ సామర్థ్యాలను వెల్లడించేం దుకు పూర్తి అవకాశాలివ్వాలి.

కొన్ని కన్వెన్షన్లలో వెలువడిన ఆసక్తికరమైన అనుభవాలు (కార్యక్రమాలు) క్రింద పేర్కొనబడుతున్నాయి :

### విద్యార్థుల న్యాయస్థానం

నగరంలోని పెద్ద పెద్ద కాలేజీల ప్రధానాచార్యులను (Principals) ఆహ్వానించడం జరిగింది. తమ సమస్యలను గురించి నిస్సంకోచంగా ఫిర్యాదు చేసే అవకాశం విద్యార్థులకు ఇవ్వ బడింది. వాటికి ఆయా కాలేజీల ప్రధానాచార్యులు సమాధానాలిచ్చారు. ఎస్.ఐ.ఓ.కు చెందిన ఒక విద్యార్థి ప్రభావవంతమైన రీతిలో ప్రోగ్రామ్ నిర్వహించాడు. సంస్థ అధ్యక్షులు ఆ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

### విద్యార్థుల సమస్యలు

విద్యాశాఖా మంత్రిగారి సమక్షంలో కొంతమంది విద్యార్థులకు ప్రస్తుత విద్యా వ్యవస్థపై మరియు ప్రభుత్వం యొక్క విద్యావిధానాలపై నిస్సంకోచంగా తమ అభిప్రాయా లను వెల్లడి చేసే అవకాశం ఇవ్వబడింది. విద్యాశాఖామాత్యుల ప్రసంగం తర్వాత సంస్థ అధ్యక్షులవారి అధ్యక్షోపన్యాసం జరిగింది.

### విద్యార్థుల సలహాలు

ఒక విశ్వవిద్యాలయం తన సిలబస్‌ను పునఃస్సమీక్షిస్తున్న సమయంలో విద్యార్థుల కన్వెన్షన్ ఒకటి ఏర్పాటు చేయబడింది. అందులో ఆ యూనివర్శిటీ వైస్ ఛాన్స్‌లర్ మరియు సిలబస్ కమిటీ ఛైర్మన్‌లను ఆహ్వానించి వారి ముందు తమ సలహాలను ఇచ్చే అవకాశం విద్యార్థులకు ఇవ్వబడింది.

### ఇంజనీరింగ్ విద్యార్థులు

ఇంజినీరింగ్ విద్యార్థులకు సంబంధించిన ఒక కన్వెన్షన్‌లో ఇండస్ట్రీ, యూనివర్శిటీ (Academics), రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ (R&D) గవర్నమెంట్ సెక్టార్, డిఫెన్స్‌లలో సేవలందిస్తున్న ఉన్నత స్థాయి వృత్తి నిపుణులు (Professionals) తమ తమ సెక్టార్లకు చెందిన అనుభవాలను వెల్లడించారు. ఆ తర్వాత వారి మధ్య 'ఏ సెక్టార్ ఎక్కువగా ప్రయోజనకరమైనది?' అనే అంశంపై రసవత్తర చర్చ జరిగింది. ఇంజనీర్ అయిన ఎస్.ఐ.ఓ. మాజీ అధ్యక్షులొకరు ఆ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. ఆసక్తికరమైన రీతిలో అధ్యక్షునిగా ఆయన తన సమీక్షను వెలువరించారు.



15

# పోటీలు - పరీక్షలు

విద్యార్థులను సంస్థ వైపునకు కేంద్రీకరింపజేయడానికి, చేరువ చేయడానికి పోటీలు మరియు పరీక్షలు ముఖ్యమైన సాధనాలు. ఇవి విద్యార్థుల నైజానికి చాలా దగ్గరగా ఉంటాయి కూడా. వీటివల్ల ఒనగూడే పెద్ద ప్రయోజనం ఏమిటంటే - తెలివయిన, సమర్థులయిన విద్యార్థులు, నేర్చుకోవాలనే, ముందుకు దూసుకుపోవాలనే తపనగల, ఏదయినా చేసి చూపించాలనే కాంక్షగల, పోటీతత్వంగల, ఉత్సాహవంతులయిన విద్యార్థులు సంస్థకు చేరువగా వస్తారు. మన సంస్థలో ఇప్పుడు కూడా సామర్థ్యంగల వ్యక్తుల్లో ఎక్కువ మంది ఈ పోటీల ద్వారా సంస్థకు చేరువయినవారే కావడం విశేషం.

విద్యార్థులకు సమయానికి ముందే నోట్స్ ఇచ్చి, చక్కగా వివరించాలి. ఉత్తమ రీతిలో ప్రచారాన్ని నిర్వహించి ఆకర్షణీయమైన బహుమతులను ప్రకటించాలి. ఈ విధంగా కాలేజీ/పట్టణ/జిల్లా/ప్రాంతీయ/రాష్ట్ర స్థాయిల్లో వివిధ రకాల పోటీలు నిర్వహించాలి.

**ఉదాహరణకు కొన్ని పోటీలు క్రింద పేర్కొనబడుతున్నాయి:**

● వ్యాసరచన పోటీలు ● వక్తృత్వ పోటీలు ● I.Q. Tests ● క్విజ్ ● డ్రాయింగ్ ● పెయింటింగ్ ● కార్టూన్ డ్రాయింగ్ ● నినాదాలు రాసే పోటీలు (Slogan Competition) ● కంప్యూటర్ ప్రోగ్రామ్ రైటింగ్ పోటీలు ● బెస్ట్ హ్యాండ్ రైటింగ్ పోటీలు ● రీజనింగ్ టెస్ట్ ● సైన్స్ ప్రాజెక్ట్ పోటీలు ● కార్టూన్ డ్రాయింగ్ ● అవధాన పోటీలు ● ఇన్‌స్టెంట్ ప్రసంగాలు ● ఇస్లామీయ పరిజ్ఞానంపై పరీక్షలు ● General Knowledge ● దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స) గారి పవిత్ర జీవిత చరిత్ర పై (సీరత్) పరీక్షలు ● ఇస్లామీయ చరిత్రపై పరీక్షలు.



16



# వినోదాత్మక కార్యక్రమాలు

మన కార్యకలాపాల్లో వినోదాలకు (Entertainments) దొరకవలసిన ప్రాధాన్యత ఇప్పటివరకు లభించలేదు. ఒక అధ్యయనం ప్రకారం ప్రపంచంలో మానవుల మనోవైఖరులను తీర్చిదిద్దడంలో ప్రస్తుతకాలంలో విద్య కంటే ఎక్కువగా వినోదాత్మక కార్యక్రమాల పాత్ర ఎంతగానో ఉంది. అన్నిరకాల రిజర్వేషన్లకు అతీతంగా ఒక చక్కని మూడ్‌లో నిర్వహించబడే వినోదాత్మక కార్యకలాపాలు ప్రజల మనోమస్తిష్కాలపై అసాధారణ మైన ప్రభావాలను ఏర్పరుస్తాయి.

విద్యార్థి దశయే ఆడుతూ పాడుతూ గడిపే కాలం. జీవితాన్ని వసంతకాలం వలె ఆనందించే ఆ దశలో ప్రతి ఒక్కరికీ గంభీరమైన సిద్ధాంతాల పట్ల, తర్కాల పట్ల ఆసక్తి ఉండదు. ఒకవేళ మనం ప్రతి ఒక్కరి మనోమస్తిష్కాల్లో సిద్ధాంతాలు, తర్కాలు, సాహిత్యం మొదలయినవాటి ద్వారా ప్రవేశించాలంటే సాధ్యం కాదు. అది వారి నైజానికి విరుద్ధం కూడా. అటువంటి మన కార్యాచరణ విధానం తరచూ విఫలమవుతుంది.

తరచుగా విద్యార్థుల మనోవైఖరులు మరియు నైజాలు ఆటపాటల ద్వారా, వినోదాత్మక కార్యకలాపాల ద్వారా పరోక్ష పద్ధతిలో క్రమక్రమంగా తీర్చిదిద్దబడతాయి. క్రికెట్ ఆడుతూ, క్యాంటిన్‌లో టీ తాగుతూ నవ్వుకుంటూ, గేయాలు పాడుకుంటూ, ఉద్యానవనంలో విహరిస్తూ, స్నేహితులను ఆటపట్టిస్తూ - ప్రజల మనోవైఖరులను తీర్చిదిద్దడం, వారిలో గొప్ప ఉత్సాహాన్ని, పవిత్ర నైజాన్ని అభివృద్ధిపరచడం, వారి పరిజ్ఞానాన్ని పెంపొందించడం, వారి ఆలోచనలకు సరియైన దిశను సూచించడం మొదలయినవి ఒక గొప్ప కళలో భాగాలు. కాలేజీలో ఉండే కార్యకర్తలు ఈ కళను అలవరచుకోవడం తప్పనిసరి.

సముచితమైన తయారీతో, ఏర్పాట్లతో క్రింద పేర్కొనబడిన వినోదాత్మక కార్యక్రమాలను నిర్వహించవచ్చు, నిర్వహించబడాలి కూడా:

## సాంస్కృతిక కార్యక్రమాలు

బహిరంగ సభలు మరియు కాన్ఫరెన్సుల వలె సాంస్కృతిక కార్యక్రమాలు కూడా అన్నిరకాల ఏర్పాట్లతో నిర్వహించబడవచ్చు. వాటికి సంబంధించిన ప్రచారం విస్తృత స్థాయిలో జరగాలి. విద్యార్థులు బాగా హాజరవ్వాలి. స్టేజీ అలంకరించబడి అర్ధరాత్రి వరకు

వివిధ కార్యక్రమాలు కొనసాగాలి. డ్రామాలు, మోనో యాక్టింగ్‌లు, గేయాలు, జోకులు మొదలయిన కార్యక్రమాలు జరగాలి.

ఇటువంటి కార్యక్రమాలు మనం మన క్యాంపుల్లోనయితే నిర్వహిస్తూనే ఉంటాము. అప్పుడప్పుడూ కాన్ఫరెన్సుల్లో కూడా నిర్వహిస్తూ ఉంటాము. కానీ సామాన్య స్థాయిలో విభిన్న విద్యార్థులను సమావేశపరచి ప్రత్యేకమైన సాంస్కృతిక కార్యక్రమాలను మనం నిర్వహించము. కాబట్టి అలా నిర్వహించినట్లయితే దాని ద్వారా విద్యార్థులను సంస్థకు చేరువ చేయవచ్చు. ఇంతేగాకుండా కవిసమ్మేళనం వంటి కార్యక్రమాలను సైతం నిర్వహించవచ్చు.

## స్పోర్ట్స్ మేలా

వివిధ క్రీడలకు సంబంధించిన పోటీలను, టోర్నమెంట్లను నిర్వహించాలి.

## స్టూడెంట్స్ డిన్నర్

స్టూడెంట్స్ డిన్నర్‌ను ఏర్పాటు చేయాలి. ఇది విద్యార్థులతో సంబంధాలను ఏర్పరుచుకొని, వారిని సంస్థకు చేరువ చేయడానికి దోహదపడే మంచి సాధనం. ఎంపిక చేయబడిన విద్యార్థులను ఆహ్వానించాలి. అలాగే కాలేజీల ప్రిన్సిపాళ్ళను, నిర్వాహక కమిటీ సభ్యులను, ముస్లిం నాయకులను, ఇంకా ఇతర ప్రముఖ వ్యక్తులను కూడా ఆహ్వానించి వారితో ముఖాముఖీగా (Interaction) మాట్లాడుకునే అవకాశాన్ని విద్యార్థులకు కల్పించాలి.

ఇటువంటి డిన్నర్ల కొరకు విద్యార్థుల నుంచి కూపన్ల రూపంలో డబ్బును కూడా వసూలు చేయవచ్చు.

## స్టూడెంట్స్ ఫెస్టివల్

సాంస్కృతిక కార్యక్రమాలు, స్పోర్ట్స్ మేళా, స్టూడెంట్స్ డిన్నర్, ఇంకా ఇతర పోటీలను కూడా కలుపుకొని ' స్టూడెంట్స్ ఫెస్టివల్ ' గా నిర్వహించవచ్చు.

## టూర్

ప్రయాణం అనేది తోటి మానవులను అర్థం చేసుకోవడానికి దోహదపడే మంచి సాధనం. అలాగే వారికి చేరువయ్యేందుకు, వారిని ప్రభావితం చేసేందుకు దోహదపడే ప్రభావవంతమైన మార్గం. ప్రయాణంలో సహప్రయాణీకులు కొన్ని గంటలు మనతో గడుపుతారు. సాధారణంగా ఆ సమయం పూర్తిగా తీరికతో కూడినదయి ఉంటుంది. ఈ విధంగా వారికి చేరువయ్యేందుకు, సంబంధాలను ఏర్పరుచుకునేందుకు తగిన అవకాశాలు మనకు లభిస్తాయి.

ఎంపిక చేయబడిన విద్యార్థులు మరియు మన కార్యకర్తలు కలిసి ఒక ప్రయాణ కార్యక్రమాన్ని రూపొందించాలి. తద్వారా విద్యార్థుల మనోవైఖరులు సులభమైన రీతిలో తీర్చిదిద్దబడతాయి.

అమెరికా మరియు యూరప్‌లలోని ఇస్లామీయ విద్యార్థి సంస్థలు సంవత్సరాని కొకసారి ఉమ్‌రహ్ టూర్‌ను నిర్వహిస్తాయి. మన కొరకు ఇది బహుశా సాధ్యం కాకపోవచ్చు. కానీ దేశంలోనే ఏదయినా పర్యాటక ప్రదేశానికి లేదా చారిత్రాత్మక ప్రదేశానికి వినోదాత్మక మరియు వైజ్ఞానిక యాత్రలను నిర్వహించవచ్చు. దీనికి అయ్యే ఖర్చును విద్యార్థుల నుంచే వసూలు చేయాలి.

ఇటువంటి యాత్ర సందర్భంలో నియమనిబంధనలకు అతీతంగా నడుస్తూ సాంప్రదాయేతర (Informal) విధానాల ద్వారా విద్యార్థుల్లో ఇస్లామీయ చైతన్యాన్ని, ఉద్యమం పట్ల ఉత్సాహాన్ని జనింపజేసేందుకు కృషి చేయాలి.



17

# క్యాంపులు

సెలవుల్లో నిర్వహించబడే క్యాంపులు లేదా షార్ట్‌టర్మ్ క్లాసులు విద్యార్థుల సంస్కరణకు దోహదపడే అతిముఖ్యమైన మార్గాలు. విభిన్న క్యాంపులను నిర్వహించవచ్చు. కొన్ని ఉదాహరణలు క్రింద ఇవ్వబడుతున్నాయి.

## ( 1 ) సమ్మర్ ఇస్లామిక్ క్యాంప్

సమ్మర్ క్యాంపులు సాధారణంగా నిర్వహించబడుతూనే ఉంటాయి. అయితే స్కూలు విద్యార్థుల కొరకు, యూనివర్శిటీ విద్యార్థుల కొరకు వేర్వేరుగా క్యాంపులను నిర్వహించాలి. క్యాంపుకు సంబంధించిన ప్రణాళికను బాగా ఆలోచించి రూపొందించాలి. స్వయంగా విద్యావంతులయి ఉండడమే కాకుండా విద్యార్థుల సైకాలజీ పట్ల, నైజాల పట్ల, మనోవైఖరుల పట్ల మంచి అవగాహనను కలిగియుండి, యూనివర్శిటీ లెక్చరర్ యొక్క శైలిలో పాఠాలను సరిక్రొత్త రీతిలో చెప్పగల లెక్చరర్ల సేవలను మాత్రమే వినియోగించు కోవాలి.

సాధారణ ఇస్లామిక్ క్యాంపులు మాత్రమే కాకుండా కొన్ని ప్రత్యేక క్యాంపులను నిర్వహించవచ్చు. ఉదాహరణకు సీరత్ క్యాంప్, ఇస్లామీయ ధర్మశాస్త్ర క్యాంప్, ఖుర్ఆన్ అవగాహనా క్యాంప్, ఇస్లామీయ చరిత్ర క్యాంప్ మొదలయినవాటిని కూడా నిర్వహించవచ్చు.

## ( 2 ) పర్సనాలిటీ డెవలప్‌మెంట్ క్యాంప్

ఎవరయినా మనోవైజ్ఞానికుడి (Psychologist) ద్వారా విద్యార్థుల కొరకు వ్యక్తిత్వ వికాసం (Personality Development), కమ్యూనికేషన్ స్కిల్స్ (Communication skills), Behavioural skills, నాయకత్వపు లక్షణాలు (Leadership qualities) మొదలయిన అంశాలపై క్యాంపులు లేదా వర్క్‌షాపులు నిర్వహించాలి.

## ( 3 ) జనరల్ నాలెడ్జ్ క్యాంప్

విద్యార్థుల కొరకు జనరల్ నాలెడ్జ్ (G.K.)కు సంబంధించి
చెందిన నిపుణుల సేవలను వినియోగించుకుంటూ క్యాం

### (4) స్టడీ టెక్నిక్స్ క్యాంప్

నిపుణుల సహకారంతో స్టడీ ప్లానింగ్, స్టడీ టెక్నిక్స్, నోట్స్ ప్రిపరేషన్, పరీక్షల ప్రిపరేషన్, స్టడీ కొరకు మానసిక సంసిద్ధత, మెమరీ టెక్నిక్స్, సృజనాత్మక అభివృద్ధి (Creativity Development) మొదలయిన అంశాలపై విద్యాసంవత్సరపు ప్రారంభంలో లేదా మధ్యలో క్యాంపులు నిర్వహించాలి.

### (5) ఎడ్యుకేషనల్ గైడెన్స్ క్యాంప్

నిపుణుల సహకారంతో విద్యార్థుల కొరకు విద్యాపరమైన మార్గదర్శకత్వం కొరకు గైడెన్స్ క్యాంపులు నిర్వహించబడాలి. కొన్ని ప్రాంతాల్లో ఈ రివాజు ఉంది. ఈ రివాజును మరింతగా విస్తృతపరచే అవసరముంది.



18

# విద్య మరియు సామర్థ్యాలు

తజ్కియహ్ ప్రోగ్రాముల లక్ష్యాల్లో వాటిద్వారా వ్యక్తుల సామర్థ్యాలను పెంపొందించడం కూడా ఒక లక్ష్యమై ఉండాలి. కాబట్టి క్యాంపస్ యొక్క తజ్కియహ్ ప్రోగ్రాముల్లో ఈ లక్ష్యసాధన కొరకు కొన్ని ప్రత్యేకమైన ప్రోగ్రాములు జరగాలి.

### ☞ ఫోరమ్‌లు మరియు క్లబ్‌లు

విద్యార్థుల వివిధ సామర్థ్యాలను పెంపొందించేందుకై వివిధ రకాల ఫోరమ్‌లను ఏర్పాటు చేయాలి. కొన్ని నమూనాలు క్రింద పేర్కొనబడుతున్నాయి. ఈ ఫోరమ్‌లను కాలేజీ/ పట్టణ / జిల్లా / ప్రాంతీయ / రాష్ట్ర స్థాయిల్లో కూడా ఏర్పాటు చేయవచ్చు.

- ✓ ఇంగ్లీషు స్పీకర్స్ ఫోరమ్ (English Speekers Forum)
- ✓ రైటర్స్ ఫోరమ్ (Writers Forum)
- ✓ ఇస్లామిక్ ఎకనామిక్స్ ఫోరమ్ (Islamic Economics Forum)
- ✓ ఎలక్ట్రానిక్స్ హాబీ ఫోరమ్ (Electronics Hobby Forum)
- ✓ హిస్టరీ ఫోరమ్ (History Forum)
- ✓ కార్టూనిస్ట్స్ ఫోరమ్ (Cartoonists Forum)
- ✓ వెబ్ సర్వర్స్ ఫోరమ్ (Web Servers Forum)
- ✓ లిటరరీ ఫోరమ్ / సాహిత్య వేదిక (Literary Forum)

**ఈ ఫోరమ్స్ విషయంలో కొన్ని అంశాలు**

**(1)** ఫోరమ్ సభ్యత్వం మన సంబంధీకులకు మరియు ఇతర విద్యార్థులందరికీ ఇవ్వాలి.

**(2)** ఫోరమ్‌లలో సంబంధిత రంగం పట్ల ఆసక్తి మరియు ఎంతోకొంత సామర్థ్యంగల విద్యార్థులకే సభ్యత్వాన్ని (Membership) ఇవ్వాలి.

**(3)** ఫోరమ్‌కు చెందిన కార్యకలాపాల్లో స్టడీ సర్కిల్, లైబ్రరీ, నిపుణుల నుంచి ప్రయోజనం పొందేందుకై సమావేశాలు మరియు ఫోరమ్‌కు అనుగుణంగా ఇంకా ఇతర ప్రత్యేక కార్యక్రమాలు కూడా నిర్వహించబడవచ్చు.

## ☞ పోటీలు

పోటీల విషయానికొస్తే సామాన్య పోటీల తీరుతెన్నుల గురించి పైన చర్చించడం జరిగింది. ఇవేకాకుండా ఏదయినా ప్రత్యేక రంగం లేదా అంశం గురించి కూడా చర్చాగోష్ఠులు, వ్యాసరచనలు, క్విజ్ మొదలయినవాటికి సంబంధించిన పోటీలను నిర్వహించవచ్చు.

## ☞ ప్రసంగాలు ( లెక్చర్లు )

వివిధ ముఖ్యమైన అంశాలపై తత్సంబంధిత రంగాలకు చెందినవారితో లెక్చర్లు ఇప్పించాలి. ఉదాహరణకు:

**(1)** ఏదయినా ముఖ్యమైన పరిశోధనాత్మక వార్త ప్రచురించబడినప్పుడు తత్సంబంధిత ఫ్యాకల్టీ విద్యార్థుల ముందు ఆ పరిశోధనకు సంబంధించిన లెక్చర్ ఇవ్వాలి. ఉదాహరణకు సూపర్ సోనిక్ కాంకార్డ్ గురించి ఏరోనాటిక్స్ విద్యార్థులకు, క్లోనింగ్ గురించి బయోటెక్నాలజీ విద్యార్థులకు లెక్చర్లు ఇప్పించాలి.

**(2)** ఏదయినా ముఖ్యమయిన సందర్భంలో - ఉదాహరణకు జాతీయ బడ్జెట్ సమర్పించబడిన తర్వాత ఆర్థిక శాస్త్ర విద్యార్థుల ముందు దానిని విశ్లేషిస్తూ లెక్చర్ ఇవ్వాలి.

**(3)** వివిధ దినోత్సవాల సందర్భాల్లో, ఉదాహరణకు పర్యావరణ పరిరక్షణ దినోత్సవం, ఇంజినీర్స్ డే మొదలయిన దినాల్లో తత్సంబంధిత లెక్చర్లు విద్యాలయాల్లో ఇవ్వబడాలి.

**(4)** ఇవేకాకుండా వివిధ ఫ్యాకల్టీలు మరియు సమర్థులయిన విద్యార్థుల నడుమ వారికి ఆసక్తి ఉన్న మరియు ఆవశ్యకమైన అంశాలకు సంబం ధించిన కార్యక్రమాలను నిర్వహించవచ్చు.

వర్గ సంఘర్షణకు, వర్గవైషమ్యాలకు, భువిలో ఉపద్రవాలకు దారితీసే మార్గాలను అవలంబించకూడదనే విషయం మన నిబంధనావళిలో నిర్దేశించబడింది. కాబట్టి మనం ఎట్టి పరిస్థితుల్లోనూ లా అండ్ ఆర్డర్‌కు భంగం కలిగించబోము. చట్టాన్ని మన చేతుల్లోకి తీసుకోము. చట్టవ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడబోము.

19

# సందేశం మరియు నైతిక విలువల పునరుద్ధరణ

సాధారణ విద్యార్థులందరిలో సందేశ ప్రచారం, విద్యాలయాల్లో నైతిక విలువల పునరుద్ధరణ అనేవి మన ముఖ్యమైన లక్ష్యాలు. ఎస్. ఐ. ఓ. యూనిట్లు మరియు కొన్ని జోన్‌లు కూడా ఈ పనికి ఇవ్వవలసినంత ప్రాధాన్యతను ఇవ్వవు. ఈ సందేశ ప్రచార కార్యక్రమం ద్వారా మనం దేశ భవిష్యత్తును ప్రభావితం చేయగలగడమే కాకుండా ఇస్లాం మరియు ముస్లింల కొరకు సానుకూల వాతావరణాన్ని రూపొందించడంలో మనకు ఎంతో సహకారం లభిస్తుంది. మనం సందేశ ప్రచారం విషయంలో పూర్తిగా దృష్టిని కేంద్రీకరించాలి. అలాగే పూర్తి ఏకాగ్రతతో, శ్రద్ధతో ఈ కార్యాన్ని నిర్వహించేందుకు శ్రమించాలి.

సందేశ ప్రచారానికి సంబంధించిన కొన్ని ముఖ్యసాధనాలు క్రింద పేర్కొనబడుతున్నాయి :

### ❋ వ్యక్తిగత సంబంధాలు

ఇవి సందేశ ప్రచారానికి సంబంధించిన అతిముఖ్యమైన సాధనాలు. ముఖ్యంగా వీటిపై మన దృష్టి కేంద్రీకరించబడాలి. ' వ్యక్తిగత పని ' అనే శీర్షికలో వ్యక్తిగత సంబంధాల గురించి విపులంగా చర్చించబడిన అంశాలను అధ్యయనం చేయండి.

### ❋ ఉమ్మడి ఫోరమ్‌లు

ఈ కృషిలో పాలుపంచుకొని, ఏదయినా ఉమ్మడి లక్ష్యసాధన కొరకు భుజం భుజం కలిపి కృషి చేస్తూ మనోవైఖరులను సులభంగా తీర్చిదిద్దవచ్చు. Action Based Dialogues అంటే పనికి సంబంధించిన చర్చలు సందేశానికి దోహదపడే ముఖ్యసాధనాలుగా స్వీకరించబడ్డాయి.

మనం ముస్లిమేతర విద్యార్థులను మరియు వారి సంస్థలను కలుపుకొని పనిచేస్తూ ఉమ్మడి లక్ష్యాలను సాధించేందుకై ఫోరమ్‌లు ఏర్పాటు చేసి ఉమ్మడిగా కృషి చేయాలి. ఇటువంటి ఫోరమ్‌లు కొన్ని నమూనా కొరకు క్రింద పేర్కొనబడ్డాయి:

**(1)** వెనుకటి అధ్యాయంలో పేర్కొనబడిన కొన్ని వైజ్ఞానిక ఫోరమ్‌లను ముస్లిమేతర విద్యార్థులను కూడా కలుపుకొని ఏర్పాటు చేయవచ్చు.

(2) స్పోర్ట్స్ క్లబ్, ఇంకా ఇతర క్లబ్బులు, ఫోరమ్‌లు, సాంస్కృతిక ఫోరమ్‌లు.

(3) మోరల్ ఫోర్స్ (Moral Force) నైతిక విలువల పునరుద్ధరణ కొరకు కృషి చేయాలి.

(4) యాంటీ ర్యాగింగ్ సెల్ (Anti Raging Cell)

(5) యాంటీ ఈవ్‌టీజింగ్ సెల్ (Anti Eveteasing Cell )

(6) Forum for Clean and Honest Educational System

(7) Students Forum for Communal Harmony

(8) Thinkers Forum (జాతీయ మరియు అంతర్జాతీయ సమస్యల గురించి ఆలోచించి చర్చించేందుకై ఉద్దేశించబడిన ఫోరమ్)

(9) Writers Forum

(10) Issue Based Forum (ఏదయినా అంశం ప్రాతిపదికన తాత్కాలికంగా ఏర్పాటు చేయబడే ఫోరమ్)

(11) ఏదయినా జాతీయ లేదా అంతర్జాతీయ సమస్య విషయంలో అవగాహన కల్పించేందుకై ఏర్పాటు చేయబడే ఫోరమ్ (Awareness Forum)

ఉదాహరణకు పరిసరాల పరిరక్షణ ఫోరమ్, మానవ హక్కుల ఫోరమ్, హెల్త్ అండ్ హైజీన్ విషయంలో అవగాహన కల్పించేందుకై ఏర్పాటు చేయబడే ఫోరమ్, క్యాన్సర్, టీ.బీ మొదలయిన వ్యాధులకు గురయినవారికి సేవ చేసేందుకై ఉద్దేశించబడిన ఫోరమ్‌లు మొదలయినవి.

కోర్స్ / కాలేజీ సరళి, విద్యార్థుల ఆసక్తి, మన అవసరాలు, ప్రాధాన్యతలు మొదలయినవాటిని ఆధారంగా చేసుకొని సముచితమైన కార్యక్షేత్రాలను ఎంపిక చేయవచ్చు. అలాగే విద్యార్థులందరినీ కలుపుకొని ఫోరమ్‌లు ఏర్పాటు చేసి కృషి చేయాలి.

**❋ సందేశ సమావేశం (దావతీ ఇజ్‌తిమా)**

రెండు నెలలకొకసారి జరిగే సందేశ సమావేశం ( దావతీ ఇజ్‌తిమా ) సందేశ ప్రచారాన్ని నిరంతరాయంగా కొనసాగించేందుకు దోహదపడే ముఖ్యసాధనం. దీనిని నిజమైన స్పిరిట్‌తో ఏర్పాటు చేయాలి. సమావేశం యొక్క నమూనా తరువాతి పేజీలో పొందుపరచబడింది.

# 20

# నమూనా

## ❖ లక్ష్యాలు

( 1 ) విభిన్న మతాలకు చెందిన విద్యార్థులు పరస్పరం చేరువకావడానికి అవకాశాలు కల్పించడం.

( 2 ) ఇస్లాం సందేశాన్ని క్రమబద్ధంగా వారి వద్దకు చేర్చడం మరియు ఇస్లాం పట్ల ఉన్న అపోహలను తొలగించడం.

( 3 ) విభిన్న వర్గాల మధ్య వివాదాస్పద అంశాలపై సామరస్యపూర్వకంగా చర్చించేందుకై వేదికలను ఏర్పాటు చేయడం. అలాగే విద్యార్థులను వాస్తవాలను అర్థం చేసుకునే వైపునకు సమాయత్తపరచడం.

( 4 ) మన క్యాడర్ కొరకు సందేశాత్మక కార్యకలాపాలను నిర్వహించేందుకై నిరంతరాయంగా వారిని చైతన్యపరిచే బాధ్యతలను నిర్వర్తించడం (Periodical Motivator and Regulator).

## ❖ ప్రోగ్రామ్

( 1 ) రెండు నెలలకొకసారి విభిన్న మతాలకు చెందిన విద్యార్థుల సమావేశం ఒకటి జరుగుతుంది. మన క్యాడర్ తమ స్నేహితులను సమావేశంలో హాజరుపరిచేందుకై అన్నివిధాలా ప్రయత్నిస్తుంది. ప్రచార సాధనాలను వినియోగించడం జరగదు. వ్యక్తిగత సంబంధాల ద్వారా మాత్రమే సందేశం అందించబడుతుంది.

( 2 ) ప్రతి ప్రోగ్రామ్‌లోనూ రెండు సెషన్లు ఉంటాయి. ప్రతి సెషన్‌లోనూ ఒక ముస్లిమేతరుడు ప్రసంగించడం జరుగుతుంది. ఒక ప్రసంగీకుడు మనలోనివాడయి ఉంటాడు. ఎవరయినా నిపుణుని చేత అధ్యక్షోపన్యాసం ఇప్పించడం జరుగుతుంది.

( 3 ) మొదటి సెషన్ సైద్ధాంతిక అంశం మీద జరుగుతుంది. రెండవ సెషన్ వర్తమాన పరిస్థితులపై, వివాదాస్పద అంశాలపై జరుగుతుంది.

( 4 ) కార్యక్రమ నమూనా ఈ విధంగా ఉంటుంది:

| | | | |
|---|---|---|---|
| మొదటి సెషన్ | : | మొదటి ఉపన్యాసకుడు | 15 నిమిషాలు |
| | | రెండవ ఉపన్యాసకుడు | 15 నిమిషాలు |
| రెండవ సెషన్ | : | మొదటి ఉపన్యాసకుడు | 15 నిమిషాలు |
| | | రెండవ ఉపన్యాసకుడు | 15 నిమిషాలు |
| అధ్యక్ష ప్రసంగం | : | | 30 నిమిషాలు |

**❖ మొదటి సెషన్ కొరకు అంశాల జాబితా**

( 1 ) నా మతంలో దైవభావన

( 2 ) దేవుడు ఒక్కడా ? లేక అనేకులా?

( 3 ) దేవుడు ఎలా వుండాలి ?

( 4 ) నా మతం ప్రకారం మరణానంతర జీవితం

( 5 ) దైవదౌత్య భావన

( 6 ) దేవుడు ఉన్నాడా?

( 7 ) నా మతంలో మానవునికి సంబంధించిన భావన

( 8 ) మానవుడు ఎందుకు పుట్టించబడ్డాడు?

( 9 ) ఈ విశ్వం ఎందుకు సృజించబడింది?

( 10 ) ఆదర్శవంతమైన సమాజం ఎలా ఉండాలి?

( 11 ) నా మతంలో సామాజిక న్యాయానికి సంబంధించిన భావన

( 12 ) మానవ సమానత్వం

( 13 ) నాకు నచ్చిన ధార్మిక వ్యక్తి

( 14 ) శాంతి ఎలా స్థాపించబడుతుంది?

( 15 ) మానవ హక్కులు, మతం

### ❖ రెండవ సెషన్ కొరకు అంశాల జాబితా

( 1 ) లంచగొండితనాన్ని రూపుమాపడంలో మతం పాత్ర

( 2 ) వేర్పాటువాదం - మతం

( 3 ) పేదరిక నిర్మూలన - మతం

( 4 ) ఉమ్మడి పౌరస్మృతి (Common Civil Code) - నా దృక్పథం

( 5 ) వర్గసమైక్యత విషయంలో నా సలహా. ఇవేకాకుండా మరికొన్ని అంశాలను మీరే రూపొందించుకోవచ్చు.

### ❖ విభిన్న అంశాలపై ప్రోగ్రాములు

వర్తమాన కాలానికి చెందిన ముఖ్యసమస్యలు (Burning Issues) విద్యార్థుల ఆసక్తికి కేంద్రబిందువులుగా ఉంటాయి. ఆ సమస్యల గురించి సాధారణంగా విద్యార్థుల్లో చర్చలు జరుగుతూనే ఉంటాయి. అయితే అప్పటికప్పుడే ముందడుగు వేసి ఆయా సమస్యలపై ఇష్టాగోష్ఠులను (Symposium), చర్చాగోష్ఠులను (Seminars) నిర్వహించి విద్యార్థుల దృష్టిని ఆకర్షించవచ్చు. ఇటువంటి ప్రోగ్రాములను నిరంతరాయంగా నిర్వహించడం ద్వారా వారి మనోవైఖరులను తీర్చిదిద్దవచ్చు. ఉదాహరణకు 'తెహల్కా కుంభకోణం' పై లెక్చర్, ప్రభుత్వం ప్రవేశపెట్టిన క్రొత్త ఆర్థిక విధానంపై చర్చ మొదలయిన కార్యక్రమాలను నిర్వహించవచ్చు.

### ❖ ప్రత్యేక దినోత్సవాల్లో ప్రోగ్రాములు

ప్రత్యేక దినోత్సవాల్లో ఆయా దినాల ప్రాముఖ్యతనుబట్టి విభిన్న ప్రోగ్రాములను నిర్వహించవచ్చు. విభిన్న పండుగల సందర్భాల్లో (ఇస్లామీయ హద్దులకు లోబడి ) పరస్పర శ్రేయస్సును కాంక్షిస్తూ సమైక్యతకు దోహదపడే కార్యక్రమాలతోపాటు ఐక్యరాజ్యసమితి, భారత ప్రభుత్వం తరఫు నుంచి నిర్ణయించబడిన ప్రత్యేక దినోత్సవాలు మరియు వారోత్సవాల (ఉదాహరణకు పరిసరాల పరిరక్షణ దినోత్సవం, ట్రాఫిక్ సేఫ్టీ వీక్ మొదలయినవి) సందర్భాల్లో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించవచ్చు. ఇటువంటి కొన్ని కార్యక్రమాల వివరాల కొరకు 'అనుబంధం : 3 (అ, ఆ)' ను చూడండి.

### ❖ మత సమ్మేళనాలు - మతాల మధ్య చర్చలు

మతాల మధ్య పరస్పరావగాహనతో కూడిన వాతావరణాన్ని పెంపొందించేందుకై మరియు ఇస్లాంను పరిచయం చేసేందుకై మతసమ్మేళనాలు ఎంతగానో దోహదపడతాయి. ఈ మతసమ్మేళనాలను విద్యార్థుల్లో కూడా నిర్వహించవచ్చు, విద్యార్థుల సమక్షంలో మతనాయకుల నడుమ కూడా నిర్వహించవచ్చు. ఈ కార్యక్రమం సామరస్యపూర్వక వాతావరణంలో నిర్వహించబడాలనే విషయాన్ని ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. చర్చాగోష్ఠుల్లో పాల్గొనే వ్యక్తులు సహనశీలురై, గొప్ప ఆత్మవిశ్వాసం కలవారయి, వైజ్ఞానిక దృక్పథం కలవారయి ఉండాలి. సమావేశంలో పాల్గొనేవారు కూడా ఇటువంటి గంభీరమయిన చర్చలను సహనంతో వినే నైజం కలవారయి ఉండాలి. ఒకవేళ వారిలో ఇటువంటి సద్గుణాలు లేనట్లయితే చర్చలు వాగ్వివాదాలతో, తర్కవితర్కాలతో నిండిపోతాయి. తద్వారా లాభానికి బదులు నష్టం వాటిల్లుతుంది.

విశ్వాసాలకు, మతపరమైన భావాలకు సంబంధించిన తార్కిక అంశాలు కూడా చర్చల కొరకు నిర్ణయించబడవచ్చు. అలాగే ప్రస్తుతం ఉనికిని కలిగియున్న మతాల మధ్య విభేదాల ప్రాతిపదికన కొనసాగుతున్న వివాదాస్పద అంశాలు కూడా చర్చల కొరకు నిర్ణయించబడవచ్చు.

### ❖ పోటీలు - పరీక్షలు

'తజ్కియహ్' కొరకు నిర్దేశించబడిన పోటీలు మరియు పరీక్షలకు సంబంధించిన కార్యక్రమాలను సందేశాత్మక లక్ష్యాల సాధన కొరకు కూడా ముస్లిమేతర విద్యార్థుల్లో నిర్వహించవచ్చు. 'ఇస్లామీయ పరిజ్ఞాన పరీక్ష', 'భారతీయ మతాలకు సంబంధించిన పరీక్ష' మొదలయినవి కొన్ని యూనిట్లలో ముస్లిమేతర విద్యార్థుల్లో నిర్వహించబడి విజయవంతమయ్యాయి.

### ❖ వినోద కార్యక్రమాలు

ముస్లిం విద్యార్థుల సంస్కరణ కొరకు రూపొందించబడే వినోదాత్మక కార్యక్రమాలను ముస్లిమేతర విద్యార్థుల కొరకు కూడా నిర్వహించవచ్చు.



21

# సేవ మరియు సమస్యల పరిష్కారం

విద్యార్థుల్లో పని జరగాలంటే మనం వారికి సేవ చేసేందుకు నిత్యం సిద్ధంగా ఉండటం తప్పనిసరి. సేవ అనేది మానవుల హృదయాలను గెలుచుకునేందుకు, వారి విశ్వాసాన్ని చూరగొనేందుకు మరియు వారికి చేరువయ్యేందుకు దోహదపడే మహత్తరమైన మార్గం. విద్యాలయాల్లో సంస్థ స్థాపన కొరకు మన విద్యార్థి కార్యకర్తల్లో కాలేజీ విద్యార్థులకు సేవ చేయాలనే తపన నిండి ఉండాలి. విద్యార్థుల సేవ మరియు వారి సమస్యల పరిష్కారానికి సంబంధించిన స్పష్టమైన కార్యక్రమం మన యూనిట్ల వద్ద ఉండాలి. విద్యార్థులకు సేవ చేసే విభాగాలు లేకుండా విద్యార్థి సంస్థ మనుగడ సాగించడం అసాధ్యం.

మనం విద్యార్థుల సేవ మరియు వారి సమస్యల పరిష్కారానికి సంబంధించిన కార్యక్రమాలను క్రింద తెలుపబడిన రీతిలో వర్గీకరించవచ్చు:

**○ విద్యార్థి సేవాసంబంధిత సంస్థలు**

వీటిని ప్రత్యేకంగా స్థాపించవలసి ఉంటుంది. వీటి స్థాపన మరియు నిర్వహణ కొరకు ఎంతో కొంత మూలధనం, వనరులు, మానవ వనరులు మరియు నిర్వహణావిధానం మొదలయినవి అవసరమవుతాయి.

**○ సేవకు సంబంధించిన చిన్న చిన్న స్కీములు**

ఇది సేవకు సంబంధించిన గొప్ప ప్రభావవంతమైన క్షేత్రం. సేవ మరియు సమస్యల పరిష్కారాలకు సంబంధించిన అన్ని సాధనాలలో దీని ప్రాముఖ్యత చెప్పనలవి కానిది.

**○ సామూహిక సమస్యల పరిష్కారం కొరకు ఉద్యమాలు**

ఇవి తాత్కాలికమైన మరియు సామూహిక ఉద్యమాలు.



22

# విద్యార్థి సేవాసంబంధిత సంస్థలు

విద్యార్థి సేవాసంబంధిత సంస్థలు నిస్సందేహంగా విద్యార్థులను చేరువ చేసేందుకు దోహదపడే ప్రభావవంతమైన సాధనాలు. వీలయినన్ని ప్రదేశాలలో ఇటువంటి సంస్థలను స్థాపించేందుకు కృషి చేయాలి. అయితే ఇటువంటి సంస్థల విషయంలో గుర్తుంచుకోదగిన కొన్ని ముఖ్యమైన విషయాలు క్రింద పేర్కొనబడుతున్నాయి :

(1) సంస్థల స్థాపన కొరకు నిర్వహణ, పెట్టుబడి, శ్రమ, అనుభవం, నిర్వాహక సామర్థ్యం మొదలయినవి అవసరం. నిత్యం మారుతూ ఉండే విద్యార్థి సంస్థల చక్రంలో స్థిరమైన సామర్థ్యంగల, అనుభవజ్ఞులయిన వ్యక్తులు ఉనికిని కలిగియుండటం సాధ్యం కాదు. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోనట్లయితే ఆ సంస్థ ఒక భారంగా రూపొందవచ్చు.

(2) సంస్థ సంస్థాపన మరియు నిర్వహణ కొరకు విలువైన శక్తులన్నింటినీ ధారపోయవలసి వస్తుంది. ఒకవేళ శక్తికి మించి సంస్థాగత శాఖలను స్థాపించినట్లయితే వాటి సంస్థాపన మరియు నిర్వహణలోనే మన శక్తులన్నీ వ్యయమవుతాయి. అలా జరిగిన పక్షంలో సంస్థకు వెలుపలి విశాల ప్రపంచం మరియు దానిలోని అవకాశాలను చేజిక్కించుకోవడంలో మనం వెనుకబడిపోతాము.

(3) సాధారణంగా ప్రొఫెషనల్ గ్రూపులు పెద్ద పెద్ద సంస్థలను నడుపుతూ ఉంటాయి. వాటి ద్వారా ప్రయోజనం పొందవచ్చు. ఒకవేళ ఎక్కడయినా ఏదయినా అవసరం ఏర్పడినట్లయితే ఇటువంటి ఏదయినా గ్రూపు ద్వారా ప్రయోజనం పొందవచ్చు.

(4) ఇటువంటి సంస్థలు సాధారణంగా వాణిజ్య లక్ష్యాల సాధనకై నడుపబడుతూ ఉంటాయి. కాబట్టి సేవాదృక్పథం వాటిలో అంతగా కానరాదు. అందుకే మనం ఇటువంటి సంస్థల ద్వారా ప్రయోజనం పొందేవారి నుంచి కనిష్ఠ పరిమితి లోనయినా ఫీజును వసూలు చేయక తప్పదు. కాబట్టి కొన్ని సమయాల్లో మన సంస్థలను కూడా ప్రజలు వాణిజ్య సంస్థలుగానే పరిగణిస్తారు.

ఈ కారణాల వల్ల ఎస్. ఐ. ఓ. వంటి విద్యార్థి సంస్థలో పెద్ద పెద్ద విభాగాలను నెలకొల్పే విషయంలో ప్రోత్సాహం ఇవ్వరాదు. అయితే పెద్ద పెద్ద నగరాల్లో అన్ని జాగ్రత్తలతో, మంచి స్థిరమైన సంస్థాగత ఆకృతి కొరకు వీలయితే పరిమిత స్థాయిలో



ఇటువంటి విభాగాలను నెలకొల్పవచ్చు. కానీ చిన్న యూనిట్లలో మరియు సంస్థ పటిష్టంగా లేని చోట్ల ఇటువంటి విభాగాల స్థాపనకు అనుమతి ఇవ్వరాదు. ఇటువంటి కొన్ని విభాగాలకు సంబంధించిన వివరాలు క్రింద ఇవ్వబడుతున్నాయి:

**హాస్టల్**

విద్యార్థులకు హాస్టల్ ద్వారా ప్రశాంతంగా విద్యనభ్యసించేందుకు వీలయిన వసతిని అందించవచ్చు. అక్కడ వారి విశ్వాసాలు మరియు గుణగణాలు పరిరక్షించ బడతాయి కూడా. హాస్టల్ కొరకు స్వంత భవనాన్ని సైతం నిర్మించుకోవచ్చు లేదా అద్దెకు కూడా తీసుకోవచ్చు.

**బుక్ బ్యాంక్**

విద్యార్థుల కొరకు వివిధ అంశాలకు సంబంధించిన పుస్తకాలను సేకరించి బుక్ బ్యాంక్‌ను నడపవచ్చు.

**రీడింగ్‌రూమ్**

ఏదయినా పెద్ద హాలును నిర్మించి లేదా అద్దెకు తీసుకొని రీడింగ్ రూమ్‌ను నడపవచ్చు.

**ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్**

పోటీ పరీక్షల తయారీ కొరకు, 10వ తరగతి, ఇంటర్మీడియట్ చదివే విద్యార్థుల కొరకు ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్‌ను నిర్వహించవచ్చు.



23

# సేవకు సంబంధించిన చిన్న చిన్న స్కీములు

పైన పేర్కొనబడిన విద్యార్థుల అవసరాలు ఏదో ఒక విధంగా నెరవేరుతాయి. యూనివర్శిటీలు, ఇతర విభాగాలు మరియు ఎన్‌జీవోలు సాధారణంగా ఈ అవసరాలను నెరవేర్చేందుకై కృషి చేస్తూ ఉంటాయి. కానీ విద్యార్థులకు సంబంధించిన కొన్ని అవసరాలను యూనివర్శిటీలుగానీ, ఎన్జీవోలుగానీ తీర్చలేవు. కేవలం విద్యార్థి సంస్థ మాత్రమే విద్యార్థుల నడుమ మనుగడ సాగిస్తూ వారి అవసరాలను తీర్చడంలో, సమస్యలను పరిష్కరించడంలో నిమగ్నమయి ఉంటుంది.

ఈ అవసరాలను తీర్చేందుకై ఎక్కువ మొత్తంలో పెట్టుబడులు, విస్తృతమైన ఏర్పాట్లు మరియు శక్తులు అవసరం లేదు. ప్రతి సమయంలోనూ ప్రతి విషయంలోనూ ముందడుగు వేసే, వేర్వేరు చోట్ల ఉన్న విభిన్న శక్తులను సమీకరించి వ్యవస్థీకృతం చేసే సామర్థ్యం, అన్నింటికీ మించి విద్యార్థులకు పవిత్ర సంకల్పంతో సేవ చేసేందుకు ఉత్సాహం మొదలయినవి అవసరమవుతాయి.

◆ **పద్ధతి**

(1) మీ విద్యాలయంలోని విద్యార్థుల సమస్యల గురించి మరియు వారి అవసరాల గురించి బాగా అధ్యయనం చేయండి. వెనువెంటనే పరిష్కరించవలసిన సమస్యలు మరియు తీర్చవలసిన అవసరాల జాబితాను తయారుచేయండి.

(2) ఆసక్తుల ఆధారంగా వివిధ విద్యార్థి టీములను తయారుచేయండి. ప్రతి టీముకూ ఒక పని అప్పగించండి. అవసరానికనుగుణంగా ఆ టీములో మన అసోసియేట్‌లతోపాటు ఇతర విద్యార్థులను కూడా చేర్చుకోవచ్చు.

(3) సంబంధిత టీముకు దాని బాధ్యతను, పని విధానాన్ని బాగా వివరించండి. అలాగే క్రమం తప్పకుండా దానిని సమీక్షించండి.

ఇటువంటి కొన్ని పనులు క్రింద పేర్కొనబడుతున్నాయి :

### ◆ ఎడ్యుకేషనల్ గైడెన్స్

ఈ పనిని ఏ స్థాయిలోనయినా చేయవచ్చు. ఎడ్యుకేషనల్ గైడెన్స్‌కు సంబంధించిన ప్రాథమిక సాహిత్యాన్ని సేకరించాలి. దానిని బాగా అధ్యయనం చేసి క్రింద పేర్కొనబడినవాటిలో వీలయిన పనులు చేయవచ్చు.

( 1 ) ఎడ్యుకేషనల్ గైడెన్స్‌కు సంబంధించిన లెక్చర్లు.

( 2 ) ఎప్పటికప్పుడు క్రొత్త క్రొత్త కోర్సులకు సంబంధించిన సమాచారాన్ని స్థానిక వార్తాపత్రికల్లోనూ, కాలేజీకు చెందిన వాల్ మేగజైన్‌లలోనూ ప్రచురించి ప్రచారం చేయడం.

( 3 ) విద్యాసంవత్సరపు ప్రారంభంలో ఎడ్యుకేషనల్ గైడెన్స్ కౌంటర్ల నిర్వహణ.

( 4 ) టెలిఫోన్ మరియు ఇంటర్నెట్‌ల ద్వారా విద్యార్థులకు మార్గనిర్దేశనం చేయడం.

( 5 ) నిపుణుల ద్వారా కౌన్సిలింగ్.

( 6 ) ఎడ్యుకేషనల్ గైడెన్స్ ప్రదర్శన (Educational and Career Expo).

( 7 ) గైడెన్స్ మేళాను నిర్వహించడం. అందులో వివిధ కాలేజీలు తమ కౌంటర్లను ఏర్పాటు చేయాలి. మన తరఫు నుంచి కూడా వివిధ కౌంటర్లు మరియు ప్రదర్శనలు ఏర్పాటు చేయబడాలి.

### ◆ వసతికి సంబంధించిన మార్గనిర్దేశన

( 1 ) కాలేజీ ప్రారంభమవడానికి ముందు స్థానిక విద్యార్థులతో కూడియున్న ఒక టీము నగరంలో సముచితమైన వసతి గృహాల గురించి, రూముల గురించి సర్వే నిర్వహించి తత్సంబంధిత సమాచారాన్ని భద్రపరచాలి.

( 2 ) హ్యాండ్‌మేడ్ పోస్టర్లు, కాలేజీ నోట్స్ మొదలయినవాటి ద్వారా ఈ స్కీముకు సంబంధించిన ప్రచారాన్ని నిర్వహించాలి.

( 3 ) ఆ టీము బయటినుంచి వచ్చే విద్యార్థులకు సముచితమయిన వసతి గృహాలను, అద్దె రూములను పొందడంలో సహకరించాలి.

## ◆ అడ్మిషన్ విషయంలో మార్గదర్శకత్వం

( 1 ) ఒక టీము కాలేజీ అడ్మిషన్‌కు సంబంధించిన నియమనిబంధనలు, అడ్మిషన్ ఫారమ్‌లు, ఆవశ్యక దస్తావేజులు, ఇంకా ఇతర విషయాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించాలి.

( 2 ) అడ్మిషన్ సమయంలో ఎస్.ఐ.ఓ. తరపు నుంచి హెల్ప్ కౌంటర్లు ఏర్పాటు చేయబడి కాలేజీలో ప్రవేశాన్ని పొందగోరే విద్యార్థులకు వీలయిన సహకారాన్ని అందించాలి.

## ◆ ఫ్రెషర్స్ డే / ఫ్రెషర్స్ క్యాంప్

క్రొత్త విద్యార్థులకు స్వాగతం పలకాలి, పూర్తిగా ఒకరోజు వివరణాత్మక కార్యక్రమాన్ని నిర్వహించి విద్యార్థులకు సంపూర్ణ మార్గనిర్దేశనం చేయాలి. ఫ్రెషర్స్ డే ప్రోగ్రామ్‌కు సంబంధించిన వివరాల కొరకు 'అనుబంధం-5' చూడండి.

## ◆ ఆర్థిక సహాయం మరియు మార్గనిర్దేశనం

విద్యార్థులకు ఆర్థిక సహాయాన్ని అందించేందుకు మరియు మార్గనిర్దేశనం గావించేందుకు అవసరమయిన సమాచారాన్ని సేకరించే బాధ్యతను ఒక టీముకు అప్పగించాలి. క్రింద పేర్కొనబడిన రీతుల్లో అవసరార్థులయిన విద్యార్థులకు సహకారాన్ని అందజేయాలి :

( 1 ) స్కాలర్‌షిప్పులు ఇచ్చే, ఆర్థిక సహాయాన్ని అందించే సంస్థలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించడం, స్కాలర్‌షిప్పులు పొందే విషయంలో మార్గనిర్దేశనం చేయడం మరియు సిఫారసులు చేయడం.

( 2 ) నగరంలోని ధనవంతులను కలుసుకొని ఒక్కొక్కరు ఒక్కొక్క విద్యార్థిని స్పాన్సర్ చేసేలా కృషి చేయాలి.

( 3 ) విద్యార్థులు పరస్పరం సహకరించుకునేలా వారిని ప్రోత్సహించడం. ఉదాహరణకు తొమ్మిది మంది విద్యార్థులు కలసి పేదవాడయిన పదవ విద్యార్థికి సంబంధించిన ఖర్చులను భరించడం.

( 4 ) పుస్తకాల షాపులు మరియు స్టేషనరీ వస్తువులమ్మే దుకాణాల యజమానులను కలసి పేద విద్యార్థులకు అవసరమైన వస్తువులను స్పాన్సర్ చేయమని కోరడం.
( 5 ) స్తోమతను బట్టి ఎస్. ఐ. ఓ. యొక్క బైతుల్‌మాల్ నుంచి కూడా స్కాలర్‌షిప్పులను జారీ చేయడం.

## ◆ నోట్స్ బ్యాంక్

( 1 ) ఒక టీము విద్యాసంవత్సరం ముగియగానే విద్యార్థుల నోట్సులన్నింటినీ సేకరించాలి.
( 2 ) ఆ నోట్సులను బైండింగ్ చేయించి భద్రపరచుకోవాలి.
( 3 ) జూనియర్ విద్యార్థుల కొరకు నోట్స్ బ్యాంకును (Notes Bank) నిర్వహించాలి. ఇదే విధంగా ప్రశ్నాపత్రాలకు సంబంధించిన క్వశ్చన్ పేపర్స్ బ్యాంకు (Question Papers Bank)ను కూడా నిర్వహించవచ్చు.

## ◆ ఆఫీసు పనుల్లో మార్గనిర్దేశనం మరియు సహకారం

( 1 ) ఒక టీము కాలేజీ / యూనివర్శిటీకి సంబంధించిన నియమనిబంధనలు, కాగితపు కార్యకలాపాలు, దస్తావేజులు మొదలయినవాటికి సంబంధించిన సమాచారాన్ని అన్ని కోణాల్లోనూ అధ్యయనం చేయాలి. కాలేజీ లేదా యూనివర్శిటీల లేదా ఇతర కార్యాలయాలకు చెందిన ఉద్యోగులతో మంచి సంబంధాలను కొనసాగించాలి.
( 2 ) ఆ టీము గురించిన ప్రచారం జరగాలి.
( 3 ) ఆ టీము వివిధ కార్యాలయాలకు సంబంధించిన వ్యవహారాల విషయంలో విద్యార్థులకు మార్గనిర్దేశనం చేయాలి మరియు సహకరించాలి.

## ◆ కోఆపరేటివ్ స్టోర్స్

విద్యార్థులకు అవసరమయిన వివిధ వస్తువుల కొరకు (పుస్తకాలు, స్టేషనరీ, రోజువారీ ఆవశ్యక సామగ్రి మొదలయినవి) స్వయంగా విద్యార్థుల ద్వారానే ఒక చిన్న మొబైల్ కోఆపరేటివ్ స్టోర్‌ను నిర్వహించవచ్చు.

**◆ వివిధ సబ్జెక్టులకు సంబంధించిన టీములు**

జూనియర్ విద్యార్థులకు అవసరాన్నిబట్టి మార్గనిర్దేశనంగావించేందుకై వివిధ సబ్జెక్టులకు సంబంధించిన టీములను రూపొందించవచ్చు. ఆ టీముల్లో సంబంధిత సబ్జెక్టుల్లో ఆసక్తిగల, సామర్థ్యంగల, మంచి ఎడ్యుకేషనల్ రికార్డ్ గల విద్యార్థులను చేర్చాలి.

ఆ టీముల గురించి ప్రచారం జరుగుతుంది. టీములకు చెందిన విద్యార్థులు తమ జూనియర్లకు ఖాళీ సమయాల్లో వారి సందేహాలను నివృత్తి చేయడమేకాక వారి సమస్యలను పరిష్కరిస్తారు.

**◆ అప్లయెన్సెస్ బ్యాంక్** (Appliances Bank)

విద్యార్థులకు కొన్ని వస్తువులు తాత్కాలిక వినియోగం నిమిత్తం అవసరమవుతాయి. కానీ వాటి ధర ఎక్కువ ఉన్నప్పటికీ వాటిని కొనవలసిన తప్పనిసరి పరిస్థితి వారికి ఎదురవుతుంది. ఒకవేళ ఇటువంటి కొన్ని వస్తువులను బ్యాంక్ రూపంలో ఉంచి అవసరార్థులయిన విద్యార్థులకు కొన్ని షరతులకు లోబడి ఒక రోజు కొరకు లేదా రెండు మూడు రోజుల కొరకు ఇవ్వడం వల్ల వారికి ఎంతో సౌలభ్యం చేకూర్చినట్లవుతుంది.

ఉదాహరణకు డ్రాఫ్టర్, ఏప్రాన్, సర్వేయింగ్ టూల్స్, సైంటిఫిక్ క్యాలిక్యులేటర్, డిసెక్షన్ బాక్స్, మల్టీ మీటర్ మొదలయినవి.



24

# సమస్యలు - వాటి పరిష్కారాలు

విద్యార్థుల్లో పని జరగాలంటే మనం వారి సమస్యల పట్ల ఆసక్తిని కనబరచాలి. అలాగే వాటిని పరిష్కరించేందుకై తీవ్రంగా ప్రయత్నించాలి. ఒక విద్యార్థి సంస్థకు చెందినవారిగా మనం విద్యార్థుల సమస్యలతో సంబంధం లేకుండా ఉండలేము. మనం విద్యార్థుల సమస్యల విషయంలో వెంటనే స్పందించి, వాటిని పరిష్కరించడంలో ముందడుగు వేయాలి.

ఈ నేపథ్యంలో కొన్ని సూత్రప్రాయమైన విషయాలను మనం గుర్తుంచుకోవాలి:

(1) భారత దేశంలోని విద్యార్థి ఉద్యమాలు ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా రాజకీయ లక్ష్యాలను మరియు ప్రయోజనాలను కలిగియుంటాయి. సాధారణంగా విద్యార్థి సంఘాలు విద్యార్థుల్లో తమ ఉనికి స్థిరంగా నెలకొని ఉండేందుకుగాను నిత్యం ఏవో సమస్యలను లేవనెత్తే ప్రయత్నం చేస్తూ ఉంటాయి. విద్యార్థుల్లో హంగామా సృష్టించే సమ్మెలను, ఉద్యమాలను నిర్వహించేందుకు అవి ప్రయత్నిస్తూ ఉంటాయి. ఆ విధంగా అవి సమస్యలను పరిష్కరించేందుకు ప్రయత్నిస్తూ రాజకీయ ప్రయోజనాలను సైతం ఆశిస్తాయి.

అయితే మన దృష్టిలో ఎటువంటి రాజకీయ ప్రయోజనమూ లేదు. అలాగే మన ప్రయోజనాల కొరకు విద్యార్థుల సమయాన్ని, శక్తులను, భావావేశాలను ఖర్చుపెట్టడాన్ని మనం ధర్మసమ్మతంగా భావించడం లేదు. మనం పవిత్ర సంకల్పంతో, పరలోకంలో దేవునికి జవాబు చెప్పుకోవలసి ఉంటుందన్న భావనతో విద్యార్థుల నిజమైన సమస్యలను సవ్యమైన రీతిలో పరిష్కరించాలని కోరుకుంటున్నాము.

(2) ఇతర విద్యార్థి ఉద్యమాలు హంగామా సృష్టించే కార్యక్రమాలపై, తాత్కాలిక భావావేశాలపై ఆధారపడివుంటాయి. అందుకే అవి స్థిరమైన, శాశ్వత ప్రాతిపదికన తలపెట్టబడే కార్యాలను సహనంతో నిర్వహించలేవు. కాబట్టి అవి మనుగడ సాగించాలంటే ప్రతి చిన్న-పెద్ద, వాస్తవిక-అవాస్తవిక, అవసరమైన-అనవసరమైన,

సంబంధించిన- సంబంధంలేని ఉద్యమాలను లేవనెత్తి విద్యార్థుల సమయాన్ని వృధా చేయడం వాటికొరకు తప్పనిసరి.

కానీ ఆ అవసరం మనకు లేదు. మన స్థిరమైన సందేశాత్మక మరియు సంస్కరణాత్మక కార్యక్రమం, పటిష్టమైన శిక్షణాత్మక విభాగాలు నిరంతరాయంగా విద్యార్థులకు సేవలందించేందుకై ఏర్పాటు చేయబడిన మన స్కీములు, ఫోరమ్‌లు, సమతుల్యమైన ప్రోగ్రాములు మన ఉనికి కొరకు శక్తిమంతమైన పునాదులను వేస్తాయి. వాస్తవంగా విద్యార్థుల సమస్యలను పరిష్కరించటానికై కొనసాగే మన ప్రయత్నాలు నూటికి నూరు శాతం వాటి కొరకు ఉద్దేశించబడినవై వుంటాయి. మనం మన శాశ్వత మనుగడ కొరకు, మన ఉనికిని తెలియజేసేందుకై ఈ ఉద్యమాలపై ఆధారపడిలేము.

పైన పేర్కొనబడిన కారణాల వల్ల విద్యార్థుల సమస్యల విషయంలో మన వైఖరి ఇతర విద్యార్థి సంఘాల వైఖరికంటే ఎంతో భిన్నంగా ఉంటుంది. ఈ వ్యత్యాసాన్ని క్రింద వివరించబడిన అంశాల ఆధారంగా చక్కగా గ్రహించవచ్చు:

(1) ఇతర విద్యార్థి సంస్థలు సమస్యలను సృష్టించేందుకు ప్రయత్నిస్తూ ఉంటాయి. అలాగే విద్యార్థులతో సంబంధంలేని, అవాస్తవిక సమస్యల విషయంలోనూ హంగామాను సృష్టిస్తూ ఉంటాయి. కానీ మన దృష్టిలో విద్యార్థుల విద్యాభ్యాసం మరియు వారి అభివృద్ధి ఎంతో ముఖ్యమైనవి. అనవసరమైన, విద్యార్థులతో సంబంధంలేని సమస్యల విషయంలో వారు తమ శక్తులను, సమయాన్ని దుర్వినియోగపరచకూడదని మనం కోరుకుంటాము. కాబట్టి మనం కేవలం నిజంగానే వారిని కష్టాలకు, నష్టాలకు గురిచేసే వాస్తవిక సమస్యల పరిష్కారం కొరకే కృషి చేస్తాము.

(2) ఇతర విద్యార్థి సంస్థలు వేటి ద్వారానయితే సమ్మెలను, ధర్నాలను నిర్వహించవచ్చో అటువంటి సమస్యలను మాత్రమే విద్యార్థుల సమస్యలుగా ఎంపిక చేసు కుంటాయి. అయితే మనం ఆ సమస్యలతోపాటు వారికి సంబంధించిన శాశ్వత సమస్యలపై

కూడా దృష్టిని సారించి వాటి పరిష్కారానికై కృషిని సాగిస్తాము. విద్యార్థుల సేవకు సంబంధించి పైన పేర్కొనబడిన అంశాలే మన ఆశయాలను ఆవిష్కరిస్తున్నాయి.

( 3 ) ఇతర విద్యార్థి సంస్థలు విద్యార్థుల సమస్యల పరిష్కారానికై హంగామాను సృష్టించే మరియు అలజడిని రేకెత్తించే మార్గాలనే స్వీకరించి తద్వారా ప్రసిద్ధి చెందాలని కోరుకుంటూ ఉంటాయి. అయితే మనం సమస్యలను వీలయినంత త్వరగా పరిష్కరించాలని కోరుకుంటాము. అందుకే మనం సమస్యల పరిష్కారానికై సవ్యమైన, తార్కికమైన మార్గాన్ని స్వీకరిస్తాము.

( 4 ) ఇతర విద్యార్థి సంస్థలు రాజకీయ ప్రయోజనాల నిమిత్తం విద్యార్థులకు సంబంధించిన సమస్యల పరిష్కారంలో ఆధిపత్యం చెలాయించాలని కోరుకుంటాయి. అయితే మనం సమస్యల పరిష్కారానికై అందరినీ కలుపుకొని కృషి చేయడాన్ని ఆవశ్యకంగా భావిస్తాము. మన సందేశాత్మక ఆశయాలు ఈ మార్గాన్నే కోరుతున్నాయి.

ఈ కీలకమయిన విషయాలను బాగా అర్థం చేసుకోవడం, వాటి పట్ల లోతయిన అవగాహనను కలిగియుండటం ఎంతో అవసరం. ఇక ఇప్పుడు మనం విద్యార్థుల సమస్యలను పరిష్కరించేందుకై ఏయే మార్గాలను అవలంబించవచ్చో తెలుసుకునే ప్రయత్నం చేద్దాం :

ఏదయినా సమస్య ఎదురయినప్పుడు ముందుగా దానిని చక్కగా అధ్యయనం చేయాలి. అసలు సమస్య ఏమిటి ? దానిని వాస్తవిక మరియు ప్రత్యక్ష సాధనాల (Direct Sources) ద్వారా అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి. చెప్పుడు మాటల మీద నిర్ణయాలు తీసుకోరాదు. దానికొరకు ముందుగా సమస్యకు సంబంధించిన దస్తావేజులను అధ్యయనం చేయాలి. ఒకవేళ ప్రభుత్వం జారీ చేసిన ఏదయినా జీ.వో. ( ప్రభుత్వ ఉత్తర్వు ) కారణంగా సమస్య ఏర్పడినట్లయితే జీ.వో.ను చదవాలి. ఎవరయినా ఆఫీసర్ / వైస్ ఛాన్సలర్ / ప్రిన్సిపాల్ యొక్క ఆజ్ఞ సమస్యకు కారణభూతమయినట్లయితే సంబంధిత సర్క్యులర్‌ను లేదా ఉత్తర్వును లేదా నిర్ణయాన్ని పూర్తిగా చదవాలి. ఏదయినా సంఘటన లేదా ప్రమాదం జరిగినట్లయితే ప్రత్యక్ష సాక్షుల ద్వారా వివరాలు తెలుసుకోవాలి.

సమస్యను అర్థం చేసుకునేందుకు ఇరువర్గాల వాదనలను, వారి ఆధారాలను తెలుసుకోవడం తప్పనిసరి. ప్రభుత్వం తరపు నుంచి ఏదయినా తీర్పు వెలువడినట్లయితే దానికి సంబంధించిన ఆధారాలు ప్రభుత్వం వద్ద ఏమున్నాయో గమనించాలి. అలాగే విద్యార్థుల అభ్యంతరాలకు దానివద్ద ఉన్న సమాధానాలను పరిశీలించాలి.

✎ ఇక రెండవ స్థాయిలో మనం ఆ సమస్య గురించి నిపుణులతో చర్చించాలి. విద్యారంగ నిపుణులు, యూనివర్శిటీ నియమనిబంధనల నిపుణులు, సీనియర్లయిన మరియు విశ్వసనీయులయిన అధ్యాపకులు, చట్టపరమైన నిపుణులు, న్యాయవాదులు మొదలయినవారితో సమస్య గురించి చర్చించాలి. సమస్య విషయంలో మనలో ఉన్న సంశయాలను వారి సలహాలు అన్ని కోణాల్లోనూ నివృత్తి చేస్తాయి.

✎ పైన పేర్కొనబడిన లక్ష్యాల సాధనకై అవసరానికనుగుణంగా ఒక స్టడీ కమిటీని ఏర్పాటు చేయాలి. సమస్య ఏ రకానికి చెందినది ? దాని విస్తృతి ఏమిటి ? దాని ఆవశ్యకత ఎంత ? ఇత్యాది విషయాలను అధ్యయనం చేసేందుకై ఆ కమిటీకి కొన్ని గంటల నుంచి కొన్ని వారాల వరకు ఏదో ఒక డెడ్‌లైన్ ఇవ్వాలి.

✎ స్టడీ కమిటీ తన నివేదికను మన సంస్థాగత సమావేశంలో సమర్పిస్తుంది. దానిపై మనం క్షుణ్ణంగా చర్చించి తార్కికమైన, ఆధారసహితమైన (Well argued, Well studied Stand point) ఒక దృక్పథాన్ని స్వీకరిస్తాము. అలాగే మన దృక్పథానికి సంబంధించిన ఆధారాలు ఏమిటి? వైరి వర్గానికి చెందిన ఆధారాలకు మన వద్ద ఉన్న సమాధానాలేమిటి? మనం మాట్లాడే తీరు ఏమిటి? అన్నింటికంటే ముఖ్యంగా ఆ సమస్యను క్రమబద్ధంగా పరిష్కరించేందుకు దోహదపడే కార్యాచరణ విధానమేమిటి? దానికొరకు మనం ఎక్కడి వరకు వెళ్ళగలము? ఇత్యాది విషయాలను కూడా మనం నిర్ణయిస్తాము. ఈ సందర్భంలో ఎవరయినా వ్యక్తులకు లేదా ఏదో ఒక చిన్న కమిటీకి తప్పకుండా తత్సంబంధిత అధికారాలను కూడా అప్పగించాలి.

✎ మనం మన సంస్థాగత సమావేశంలో వెలువరించిన తీర్మానాన్ని జోన్ ద్వారా ఆమోదం పొందుతాము.

నోట్ : ఈ పనిని శీఘ్రంగా పూర్తిచేసే అలవాటును మనం అలవరచుకోవాలి. కొన్ని తాత్కాలిక పరిస్థితుల్లో పైన పేర్కొనబడిన ఐదు స్థాయిలు పన్నెండు నుంచి పదిహేను గంటల్లోగా నిర్ణయించబడాలి.

సమస్య రకాన్నిబట్టి మనం దాని పరిష్కారానికై క్రింద పేర్కొనబడిన మార్గాలను క్రమబద్ధమైన రీతిలో స్వీకరిస్తాము :

(i) సంబంధిత అధికార వర్గాలను ప్రతినిధి బృందాల రూపంలో కలుసుకొని మన దృక్పథాన్ని ఆమోదింపజేసేందుకై వారితో చర్చలు జరపాలి.

(ii) ఇతర విద్యార్థి సంస్థల ప్రతినిధులను కలుసుకొని చర్చాగోష్ఠులు నిర్వహించడం, ఉమ్మడి కార్యాచరణవిధానాన్ని, ఉమ్మడి ప్రయత్నాల కొరకు సంయుక్త స్టాండింగ్ కమిటీని నెలకొల్పడం.

(iii) ప్రెస్ కాన్ఫరెన్సులను ఏర్పాటుచేయడం.

(iv) సభలు, ప్రసంగాలు, పోస్టర్లు, వాల్‌రైటింగ్‌లు, హ్యాండ్‌మేడ్ పోస్టర్లు మొదలగున్నవి.

(v) అధ్యాపకుల్లో , మేనేజ్‌మెంట్ విభాగానికి చెందినవారిలో సానుభూతి పరు లయిన వ్యక్తులతో చర్చించి వారి ద్వారా సంబంధిత అధికారులపై ఒత్తిడి తీసుకురావడం.

(vi) నగరానికి చెందిన ధనవంతులతో మరియు సంబంధిత అధికారులను ప్రభావితం చేయగల వ్యక్తులతో చర్చించాలి.

(vii) చట్టపరమైన లావాదేవీలు నడపడం, న్యాయవాదుల ద్వారా నోటీసు ఇప్పించడం, న్యాయస్థానంలో పర్సనల్ లేదా పబ్లిక్ ఇంట్రెస్ట్ పిటిషన్ వేయించడం.

(viii) ధర్నాలు, సమ్మెలు చట్టపరిధిలో శాంతియుత వాతావరణంలోనే జరగాలి.

(ix) ర్యాలీలు, ధర్నాలు, మార్చింగ్‌లు నిర్వహించడం.

సమస్యను వీలయినంత సులభమైన రీతిలో పరిష్కరించటానికే మనం ప్రయత్నించాలి. సంబంధిత అధికారులతో అసమంజసమైన రీతిలో అమర్యాదపూర్వకంగా ప్రవర్తించరాదు. కానీ ఒకవేళ సమస్య పరిష్కారం జరగకపోతున్నట్లయితే ఇస్లామీయ ధర్మశాస్త్రం మరియు చట్టపరిధికి లోబడి ప్రజాభిప్రాయాన్ని సేకరించేందుకు, విద్యార్థుల హక్కుల సాధన కొరకు ఒత్తిడి తెచ్చేందుకు, మన డిమాండ్లను ఆమోదింపజేసేందుకు అన్నిరకాల ప్రసిద్ధ ప్రజాస్వామిక విధానాలను సముచితమైన రీతిలో క్రమబద్ధంగా సరయిన సమయంలో మనం స్వీకరిస్తాము.



25

# కో-కరిక్యులర్ యాక్టివిటీస్

కాలేజీకి చెందిన సహపాఠ్య కార్యకలాపాలు(Co-curricular Activities) విద్యాలయాల్లో విద్యార్థులకు చేరువయ్యేందుకు, వారికి నాయకత్వం వహించేందుకు మరియు వారి మనోవైఖరులను ప్రభావితం చేసేందుకు దోహదపడే మహత్తర సాధనాలు. సహపాఠ్య కార్యకలాపాలను మన లక్ష్యాల సాధన కొరకు ప్రభావవంతమైన రీతిలో వినియోగించుకునేందుకు మనం ప్రయత్నించాలి.

✦ మన సభ్యులు సహపాఠ్య కార్యకలాపాల్లో ( ఉదాహరణకు సాంవత్సరిక సమావేశం, స్పోర్ట్స్, వివిధ పోటీలు, కాలేజ్ మేగజైన్, ఎన్. ఎస్. ఎస్, ఇంకా ఇటువంటి ఇతర స్కీములు, స్టూడెంట్స్ ఫెస్టివల్ మొదలయినవి ) పూర్తిగా పాలుపంచుకోవాలి. మన సభ్యులు పాలుపంచుకోని ముఖ్యమైన సహపాఠ్య కార్యక్రమమేదీ ఉండరాదు. (కానీ ఇస్లామీయ ధర్మశాస్త్రం ప్రకారం నిషిద్ధమైన కార్యక్రమాలు తప్ప. ఎందుకంటే అటువంటి కార్యక్రమాలనయితే మనం అడ్డుకునే ప్రయత్నం చేస్తాము.)

✦ మన సభ్యులకు మరియు అసోసియేట్లకు సహపాఠ్య కార్యకలాపాలలో పూర్తిగా పాలుపంచుకునేలా మరియు వాటిని నైతిక లక్ష్యాల సాధన కొరకు వినియోగించుకునేలా శిక్షణ ఇవ్వాలి. దానికొరకు యూనిట్ స్థాయిలోనూ, జోన్ స్థాయిలోనూ కార్యాచరణ ప్రణాళికను రూపొందించుకోవాలి. ఏయే కాలేజీల్లో మన సంబంధీకులు కనీసం ఎన్ని ప్రోగ్రాములు సమర్పించాలి ? అనే విషయమై లక్ష్యాలు నిర్దేశించబడాలి.

నిర్దేశించబడిన లక్ష్యాలకు అనుగుణంగా మన సంబంధీకులకు శిక్షణ ఇవ్వాలి. రిహార్సల్స్ చేయించాలి. అనుభవజ్ఞుడయిన సభ్యుడు వారికి మార్గనిర్దేశనం చేయాలి. ఈ విధంగా క్రమబద్ధంగా, ప్రణాళికాబద్ధంగా ఈ కార్యక్రమాల ద్వారా ఆయా కాలేజీల్లో సంస్థ స్థాపన జరగాలి.

✦ ఈ కార్యకలాపాల్లో పాలుపంచుకుంటూ కాలేజీ సాంస్కృతిక కార్యక్రమాలు ఎంతో ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా ఉంటాయనే సంగతిని మనం మరువరాదు. మన

సందేశం ఎంత ప్రభావాత్మకమైనదయినా, ప్రయోజనకరమైనదయినా ఒకవేళ సమర్పణాశైలి పేలవంగా ఉన్నట్లయితే అటువంటి ప్రోగ్రాములు విజయవంతం కావు. ఇస్లామీయ ధర్మశాస్త్రం హద్దుల్లో ఉంటూ మన మహోన్నతమైన సందేశాన్ని ఆసక్తికరంగా, జనరంజకంగా సమర్పించే సామర్థ్యాన్ని మనం అలవరచుకోవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.



26

# స్టూడెంట్స్ యూనియన్‌లు

కాలేజీలలో తరచుగా సహపాఠ్య కార్యకలాపాల నిర్వహణా బాధ్యతలను స్టూడెంట్స్ యూనియన్‌లు నిర్వర్తిస్తూ ఉంటాయి. స్టూడెంట్స్ యూనియన్‌లు విద్యార్థులకు నాయకత్వం వహించడంలో ముఖ్యపాత్ర వహిస్తాయి. ఒకవేళ కాలేజీలో స్టూడెంట్స్ యూనియన్ ఉన్నట్లయితే దానిని రూపొందించడంలో, తీర్చిదిద్దడంలో మనం ముఖ్యపాత్రను నిర్వహించాలి.

- స్టూడెంట్స్ యూనియన్ లేదా కౌన్సిల్‌కు చెందిన సభ్యులు ఒకవేళ మెరిట్ ఆధారంగా నియుక్తులవుతున్నట్లయితే మన సంబంధీకులు అందుకు యోగ్యులుగా రూపొందేందుకు కృషి చేయాలి. అలాగే మనం మెరిట్ విద్యార్థులతో (Meritorious Students) మెరుగైన సంబంధాలను కొనసాగించాలి. అలాగే వారిని మన భావాలతో ఏకీభవించేవారిగా మలచి తద్వారా వారిపై మన నాయకత్వం బలపడేందుకు ప్రయత్నించాలి.

- ఒకవేళ యూనియన్ లేదా కౌన్సిల్ ప్రతినిధుల ఎన్నికలు జరుగుతున్నట్లయితే ఆ ఎన్నికల సందర్భంలో సంబంధిత విద్యాలయంలో మన శక్తిని దృష్టిలో ఉంచుకొని పాలసీని రూపొందించుకోవాలి.

- ఒకవేళ మనం విద్యాలయంలో బలహీనంగా ఉన్నట్లయితే, వ్యక్తుల సంఖ్యాబలం (Man Power) కూడా తక్కువగా ఉన్నట్లయితే మనవాళ్ళు ఇతరులతో కలసి మంచి అభ్యర్థులను గెలిపించేందుకు కృషి చేస్తారు. అలాగే గెలిచిన అభ్యర్థు లతో మంచి సంబంధాలను కలిగియుండేందుకు, వారి ఆలోచనాధోరణులను ప్రభావితం చేసేందుకు మరియు వారిని తమ పదవులను నిజమైన లక్ష్యాల కొరకు వినియోగించేలా రూపొందించేందుకు కృషి చేస్తారు.

- ఒకవేళ విద్యాలయం ఎన్నికలనే ప్రభావితం చేసే స్థాయిలో మనం బలాన్ని కలిగియున్నట్లయితే సంస్థ పేరు మీద లేదా పేరుతో నిమిత్తం లేకుండానే షరతుల ప్రాతిపదికన అభ్యర్థులకు మద్దతు తెలిపి యూనియన్ ఎన్నికలను ప్రభావితం

చేసేందుకు ప్రయత్నిస్తాము. సంబంధిత కాలేజీకి చెందిన పరిస్థితులను, సంస్థ పాలసీని మరియు సామాన్య నైతిక నియమాలను దృష్టిలో ఉంచుకొని షరతులను రూపొందించాలి. నమూనా కొరకు 'అనుబంధం - 6' చూడండి.

✸ ఒకవేళ కాలేజీ యూనియన్ ఎన్నికల్లో గెలవగల సామర్థ్యం మనకు ఉన్నట్లయితే, యూనియన్‌కు చెందిన కీలక పదవులను సాధించే సత్తా మనకు ఉన్నట్లయితే రాష్ట్రాధ్యక్షుని అనుమతి తీసుకొని యూనియన్ ఎన్నికల్లో పాలుపంచుకుంటాము.

**పరిస్థితుల దృష్ట్యా మనం...**

(i) వ్యక్తిగతంగా స్వతంత్ర అభ్యర్థుల స్థాయిలో

(ii) భావసారూప్యతగల వ్యక్తులతో కలసి ఫోరమ్ నెలకొల్పి

(iii) సంస్థ పేరుతో ఎన్నికల్లో పాలుపంచుకోవచ్చు.

కానీ ఎన్నికల్లో పాలుపంచుకునేందుకై స్థానిక యూనిట్ సమావేశంలో దానికి సంబంధించిన నిర్ణయం తీసుకోబడాలి. అలాగే రాష్ట్రాధ్యక్షుడు దానికి ఆమోదం తెలపాలి.



27

# వ్యక్తిగత సంబంధాలు

ఉద్యమ కార్యకలాపాలు విద్యాలయాల్లో జరిగినా లేక వేరేచోట ఎక్కడ జరిగినా అందులో వ్యక్తిగత సంబంధాలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. వాస్తవానికి వ్యక్తుల మనోమస్తిష్కాలను తీర్చిదిద్దడమనేది ముఖ్యంగా వ్యక్తిగత సంబంధాల ద్వారానే సాధ్యమవుతుంది. సాముహిక వ్యవస్థ కేవలం అందుకు తోడ్పడే సాధనం మాత్రమే. పటిష్టమైన మరియు ప్రభావవంతమైన వ్యక్తిగత సంబంధాలు లేకుండా సాముహిక వ్యవస్థ మొత్తం ప్రయోజనరహితంగా మారిపోతుంది.

మన కార్యకర్తల్లో వ్యక్తిగత సంబంధాలను కొనసాగించడం పట్ల ఆసక్తి ఉండాలి. అలాగే వాటికి సంబంధించిన మర్యాదల పట్ల కూడా అవగాహన మరియు ఆసక్తి ఉండాలి.

ఈ విషయంలో కొన్ని గుర్తుంచుకోదగిన అంశాలు క్లుప్తంగా క్రింద పేర్కొనబడు తున్నాయి:

(1) వ్యక్తిగత సంబంధాల కొరకు అన్నింటికంటే ఆవశ్యకమైన విషయమేమిటంటే, మన కార్యకర్తల్లో వ్యక్తిగత సంబంధాలను కొనసాగించాలనే తపన ఉండాలి. తన నగరానికి చెందిన మరియు కాలేజీకి చెందిన విద్యార్థులందరూ నిజమైన తర్ఫీదును పొంది ఎస్.ఐ.ఓ. తో తన సంబంధాన్ని పటిష్టపరచుకొని సత్యధర్మ సంస్థాపన కొరకు వారు తమ ధనమానప్రాణాలను తృణప్రాయంగా అర్పించ గలిగే విధంగా రూపొందాలనే కాంక్ష కార్యకర్తలో ఉండాలి. ఆ కాంక్ష సజీవంగా ఇరవైనాలుగు గంటలూ అతడిలో జ్వలిస్తూ ఉండాలి. ఎక్కడయినా విద్యార్థి కనిపించగానే అతడి నైజం జాగృతమయి అతడిని ఇస్లామీయ ఉద్యమానికి చేరువ చేసేందుకై అతడు తపించిపోవాలి.

ఇటువంటి సజీవ కాంక్ష, బలీయమైన కోరిక లేనట్లయితే వ్యక్తిగత సంబంధాలకు సంబంధించిన పని విజయవంతం కాదు.

(2) ఇక రెండవ ముఖ్యవిషయమేమిటంటే, మన కార్యకర్త వ్యక్తిత్వం హృదయాలను గెలుచుకునేలా, ఆకర్షణీయంగా ఉండాలి. అతడి ప్రేమానురాగాల ప్రయోజనం సర్వసామాన్యం కావాలి. ప్రతి విద్యార్థీ తన హృదయంలో అతడి పట్ల ప్రేమానురాగాలతో కూడిన భావనలను కలిగియుండాలి. అతడి సాంగత్యంలో

పవిత్రత మరియు ప్రేమానురాగాల తియ్యదనముండాలి. ప్రతి ఒక్కరికీ సేవ చేసేందుకు అతడు సిద్ధంగా ఉండాలి. అతడి వ్యక్తిత్వం ప్రతి బాధాతప్తునికి ప్రశాంతతను, సంతోషాన్ని అందజేసే దట్టమైన చెట్టు నీడలా ఉండాలి. అతడు తన ప్రవర్తన, కార్యకలాపాలు మరియు సేవల ద్వారా కూడా అటువంటి స్థితిని వ్యక్తీకరించేలా ఉండాలి.

( 3 ) ఇక మూడవ ముఖ్యవిషయమేమిటంటే, మన కార్యకర్త సంభాషణను ప్రారంభించి, దానిని కొనసాగించి ఒక సవ్యమైన దిశలో దానిని మళ్ళించే కళను అతడు ఆకళింపు చేసుకొని ఉండాలి. అతడి పరిజ్ఞానం మరియు అంశాల పరిధి కూడా విస్తృతంగా ఉండాలి. ప్రతి ఒక్కరి ఆసక్తికి కేంద్రబిందువయిన అంశం పట్ల తన అభిప్రాయాలను వ్యక్తం చేయగలిగి ఉండాలి. అతడి సంభాషణలో ఆకర్షణ ఉండాలి. అతడు తన పరిజ్ఞానం ద్వారా, సంభాషణా శైలి ద్వారా మరియు ఆధారాల ద్వారా ప్రజలను సంతృప్తపరచగలవాడయి ఉండాలి.

( 4 ) ఇక నాల్గవ ముఖ్యవిషయమేమిటంటే, కార్యకర్తలో సహనం ఉండాలి, తీవ్రమైన అభిప్రాయభేదాన్ని సైతం చిరునవ్వుతో స్వీకరించగల నైజం ఉండాలి, అతడి గంభీరమైన సంభాషణ వాగ్వివాదంలా మారిపోకూడదు. ప్రజలు అతడిని రెచ్చగొట్టలేకపోవాలి. ప్రజలను తన వాదానాపటిమతో ఓడించే కాంక్షకు బదులు వారి హృదయాలను గెలుచుకొని వాటిలో స్థానమేర్పరచుకునే కాంక్ష అతడిలో బలంగా ఉండాలి. ఈ లక్ష్యసాధన కొరకు ఒకవేళ 'ఓడిపోవలసి' వచ్చినా అతడు సంతోషంగా ఓడిపోవాలి. కొన్ని సందర్భాల్లో వాదనను ముగించే లేదా వాయిదా వేసే 'కళ' కూడా అతడిలో ఉండాలి.

ఈ మౌలిక సుగుణాలను వ్యక్తిగత సంబంధాలను విజయవంతంగా కొనసాగించేందుకై అలవరుచుకోవడం తప్పనిసరి. ఒకవేళ మన కార్యకర్తల్లో అటువంటి సుగుణాలు లేనట్లయితే మన శిక్షణావ్యవస్థను దాని వైపునకు కేంద్రీకరించి ఆ లోటును పూడ్చుకునేందుకు ప్రణాళికాబద్ధంగా కృషి చేయాలి.

వ్యక్తిగత సంబంధాల కొరకు ఏదయినా ఒక నిర్ణీత కార్యాచరణ విధానాన్ని సూచించలేము. అల్లాహ్ తన ఈ విశ్వంలో మానవుల మధ్య ఎంతటి

వైవిధ్యాన్ని రంగరించాడంటే ఏ ఇద్దరు మానవులూ పూర్తిగా ఒకే విధంగా ఉండరు. కాబట్టి ఏ ఇద్దరు మానవుల కొరకూ ఒకే విధమైన కార్యక్రమాన్ని రూపొందించ లేము. స్వయంగా తన అనుభవం, సునిశిత పరిశీలనాశక్తి మొదలయినవాటి ప్రాతిపదికన సంబోధితుని నైజాన్ని దృష్టిలో ఉంచుకొని అప్పటికప్పుడు వెనువెంటనే కార్యాచరణ విధానాన్ని రూపొందించుకోగల నేర్పు మన కార్యకర్తలో ఉండాలి.

ఒక సామాన్య కార్యక్రమం ఇక్కడ పేర్కొనబడుతోంది. కానీ ప్రతి వ్యక్తి కొరకూ విడివిడిగా అతడి నైజాన్నిబట్టి సముచిత మార్పులూ చేర్పులూ చేసే అవకాశం ఇందులో ఉండటమే కాదు, అలా చేయడం అవసరం కూడా :

➡ ముందుగా పరిచయమేర్పడిన వ్యక్తితో చక్కగా స్నేహం చేయాలి. అతడితో మంచి సంబంధాలు నెలకొనాలి. అతడు మనతో చనువుగా మెలిగే స్నేహితుడిగా రూపొందాలి. దీనికోసం మాటిమాటికీ అతడిని కలుసుకోవడం, ప్రఫుల్లమయిన వాతావరణంలో నిస్సంకోచంగా సంభాషణలు జరపడం, హాస్యంతో కూడిన సంభాషణలు జరపడం, ఒకరి ఇంటికి మరొకరు రాకపోకలు సాగించడం, తీరిక వేళల్లో కలసిమెలసి గడపడం మొదలయినవి ఎంతో అవసరం.

➡ ఇటువంటి సంబంధం మరియు స్నేహం ఏర్పడే దశలో పరిచయమైన వ్యక్తిని తన వ్యక్తిత్వంతో ప్రభావితం చేయాలి. హృదయాలను గెలుచుకునే మన స్వభావం, ప్రేమానురాగాలు, ఆప్యాయత, సర్వమానవాళి పట్ల సానుభూతి, మన పవిత్రమైన ప్రయత్నాలు, సేవ చేసే తపన, మన పటిష్టమైన మరియు ఓటమి పొందజాలని ప్రవర్తన, మన మౌలిక భావనలు, మన విడదీయరాని సంబంధం మొదలయిన అంశాలన్నింటి ప్రభావం అతడిపై పడాలి.

➡ ఈ క్రమంలో విభిన్న అంశాలపై సంభాషణలు జరుపుతూ అతడికి ఇష్టమయిన అంశాలను, అతడు భావావేశ సంబంధాన్ని కలిగియున్న అంశాలను అన్వేషించాలి. అతడు ముస్లిం అయినట్లయితే వివేకంతో ముందుగా అతడిని ప్రాథమిక ఇస్లామీయ ఆరాధనల వైపునకు మళ్ళించాలి. ఒకవేళ అతడు ముస్లిమేతరుడయి నట్లయితే ప్రాథమిక నైతిక విషయాల వైపునకు అతడిని మళ్ళించాలి.

➡ ఒకవేళ అతడు అధ్యయనం పట్ల ఆసక్తి కలిగినవాడయితే అతడికి సముచితమైన పుస్తకాలను అధ్యయనం నిమిత్తం ఇవ్వాలి. అలాగే ఆ పుస్తకాల్లోని అంశాలపై అతడితో సంభాషణలు జరపాలి.

➡ ఈ దశలో ముస్లిం విద్యార్థికి సంస్థ మరియు ఉద్యమం పట్ల, ముస్లిమేతర విద్యార్థికి ఇస్లాం మరియు మన కార్యకలాపాల పట్ల కొంతయినా ఆసక్తి ఏర్పడినట్లయితే వారిని సంబంధిత సమావేశాల్లో క్రమక్రమంగా హాజరుపరిచేందుకు ప్రయత్నించాలి.



28

# ఆదర్శనీయుడైన క్యాంపస్ వర్కర్

ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ ఎలా ఉండాలి ? అతడిలో ఎటువంటి సుగుణాలు, ప్రత్యేకతలుండాలి ? ఈ అంశంపై ఎన్నో విషయాలను పేర్కొనవచ్చు. కొన్ని అంశాల విషయంలో విభిన్న అభిప్రాయాలు కూడా వెలువడవచ్చు. ఇక్కడ కేవలం ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ గుణగణాలను సూచించే ఒక నమూనాను పొందు పరచడమే లక్ష్యం. తద్వారా దాని వెలుగులో ప్రతి కార్యకర్త తనను తాను తీర్చిదిద్దుకోగలడు.

ఇక్కడ పొందుపరచబడిన నమూనాలో పేర్కొనబడిన ప్రమాణాలను పూర్తిగా కలిగియున్నవారు మాత్రమే క్యాంపస్‌లో పని చేయవలసి ఉంటుందని చెప్పడం ఈ నమూనా ఉద్దేశం కాదు. వాస్తవానికి క్యాంపస్‌లో ప్రతి విద్యార్థీ పనిచేయగలడు. అయితే ఇక్కడ పొందుపరచబడిన నమూనాలో పేర్కొనబడిన గుణగణాల్లో కార్యకర్త ఎన్నింటిని కలిగియుంటే అంత ప్రభావవంతంగా అతడు పనిచేయగలడు. ఈ గుణగణాలన్నీ మనలో నెలకొనేందుకు మనం శాయశక్తులా కృషి చేయాలి. మనం ఆదర్శవంతమైన కార్యకర్తలం కావాలి. అయితే ఈ క్రమంలో అల్లాహ్ మనకు ప్రసాదించేవాటిని స్వీకరిస్తూ పవిత్ర సంకల్పంతో మన బాధ్యతలను నిర్వర్తిస్తూ ఉంటాము.

ఒకవేళ ఏదయినా అంశంలో మనం బలహీనంగా ఉన్నట్లయితే ఏదయినా ఇతర అంశంలో అత్యుత్తమ రీతిలో మన సామర్థ్యాలను ప్రదర్శించి ఆ బలహీనతను మరిపింప జేస్తాము (అయితే ప్రవర్తన మరియు పని పట్ల ఉత్సాహాలు ఇందుకు మినహాయింపు).

ఈ నేపథ్యంలో అన్నింటికంటే ప్రాథమికమైన విషయమేమిటంటే, ఒక ఆదర్శ నీయమైన విశ్వాసి ఒక నిజమైన ఇస్లామీయ ఉద్యమ కార్యకర్త అవుతాడు. ఇస్లామీయ ఉద్యమ కార్యకర్త క్యాంపస్‌లో పనిచేసినా, గుడిసెలో పనిచేసినా, వైజ్ఞానిక రంగంలో పనిచేసినా లేక రాజకీయ, ఆర్థిక రంగాల్లో పనిచేసినా ప్రాథమికంగా అతడు ఆదర్శవంతమైన విశ్వాసి అయి ఉండాలి.

ఈ విషయాల ప్రాతిపదికన ఒక ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ అన్నింటికంటే ముందు ఇస్లాం పట్ల లోతయిన అవగాహన కలిగియుండాలి, ఇస్లామీయ సుగుణాలకు నమూనా అయి ఉండాలి, ఇస్లామీయ నైజాన్ని అతడు కలిగియుండాలి, అల్లాహ్‌పై అచంచలమైన విశ్వాసాన్ని, ఆయన పట్ల ప్రేమను, భీతిని, పటిష్టమైన

సంబంధాన్ని, ఆఖరి దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స.అ.స.) పట్ల అవ్యాజమైన అనురాగం, ఆయన (స.అ.స.) మహోన్నతమైన వ్యక్తిత్వపు గాఢమైన ప్రభావం, ఆయన (స.అ.స.) అనుసరణ పట్ల నిజమైన ఉత్సాహం, మరణం మరియు ప్రళయదినానికి సంబంధించిన స్ఫురణ, పరలోకంలో దేవునికి జవాబు చెప్పుకోవలసి ఉందనే జవాబుదారీ తనం మొదలయిన సుగుణాలతో అతడు అలరారుతూ ఉండాలి. ఈ సుగుణాలే ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్‌లో ఉండవలసిన ఆవశ్యక గుణగణాలన్నింటికీ మూలాలు. ఇవే వ్యక్తిత్వమనే మైదానాన్ని కళకళలాడేలా చేస్తాయి. ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ వ్యక్తిత్వం ఈ మౌలిక గుణగణాలతోనూ, చైతన్యంతోనూ అలరారుతూ ఉంటుంది. వీటితోపాటు ఇస్లామీయ ఆత్మాభిమానం, ఇస్లాం కొరకు అన్నింటినీ త్యాగం చేయగల ధీరగుణం, నమాజులను, ఇంకా ఇతర ఇస్లామీయ విధులను క్రమం తప్పకుండా ఆచరించే పట్టుదల మొదలయినవి అతడిలో ఉండాలి. ఒక్కమాటలో చెప్పాలంటే, నమాజ్ ఖజా అవడమనే భావననే అతడు భరించలేకపోవాలి. అతడి జీవితం దైవభీతి, ధర్మపరాయణతతో ఆచరణాత్మకంగా శోభిల్లుతూ ఉండాలి. ఇవన్నీ ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్‌లో ఉండవలసిన మౌలికమైన లక్షణాలు.

ఇవేకాకుండా వర్తమాన ప్రపంచంలోని సామాన్య బలహీనతలు, క్యాంపస్‌లో పనిని దృష్టిలో ఉంచుకొని కొన్ని కోణాలు (వాస్తవానికి అవి ఇస్లామీయ వ్యక్తిత్వపు కోణాలే) క్రింద ప్రత్యేకంగా పేర్కొనబడుతున్నాయి:

**ప్రవర్తన**

ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ కొరకు అన్నిటికంటే ముఖ్యమైనది ఆదర్శనీయమైన, అత్యుత్తమ ప్రవర్తన. అతడి ప్రవర్తన యొక్క పవిత్రత విద్యాలయంలోని తోటి విద్యార్థులు అసూయ చెందేలా ఉండాలి. "అతడు అబద్ధం చెప్పడు, వాగ్దానాన్ని భంగం చేయడు, మోసం చేయడు, అందమైన యువతి సైతం అతడి నియమనిష్ఠలను భంగపరచజాలదు, పరీక్షల్లో ఎట్టి పరిస్థితుల్లోనూ అక్రమాలకు పాల్పడడు, అన్నిరకాల ఆశ్రిత పక్షపాత ధోరణులకూ అతడు అతీతుడు, అతడు న్యాయసౌధాన్ని ఎన్నడూ కూల్చివేయడు, అతడి దృష్టిలో తన నియమనిష్ఠలు ప్రపంచంలోని భోగభాగ్యాలన్నింటికంటే ప్రియమైనవి, అతడు

వాటిని ఎట్టి పరిస్థితుల్లోనూ భంగపరచడు ...” అని భావిస్తూ అతడి విశ్వసనీయత పట్ల ప్రజలు సంపూర్ణంగా సంతుష్టులయి ఉండాలి.

ఇస్లాం యొక్క తొలియుగంలో ఇస్లాంను అనుసరించేవారి అత్యున్నత ప్రవర్తనే దాని మహోన్నత శక్తిగా విరాజిల్లింది. నేటికీ ఈ అంశమే ఇస్లాం అనుయాయులకు నిజమైన శక్తిని ప్రసాదించగలదు. మార్గభ్రష్టత్వం మరియు అనైతికతలతో కూడిన నేటి విద్యాసంస్థల వాతావరణంలో పటిష్టమైన నైతిక ప్రవర్తనను కలిగియున్న శ్రేష్ఠుడైన యువ విద్యార్థి కాంతిపుంజంవలె ఒక మార్గదర్శిగా భాసిల్లుతాడు. అన్నిరకాల ప్రజలూ అతడి వైపునకు అయస్కాంతం వైపు ఇనుము ఆకర్షించబడినట్లుగా ఆకర్షించబడతారు. పటిష్టమైన నైతిక ప్రవర్తనను కలిగియున్న యువకుడు మరియు అతడి భావాలు అతడి ప్రమేయం లేకుండానే ప్రజల ఆసక్తికి, చర్చకు కేంద్రబిందువులుగా మారతాయి.

ఇస్లాం, ప్రవర్తనకు సంబంధించిన విస్తృతమైన భావనను అందజేసింది. ఇస్లామీయ దృక్కోణంలో అన్ని కోణాల్లోనూ మానవుడు పటిష్టమైన నైతిక ప్రవర్తనను కలిగియుండాలి. ప్రస్తుత పరిస్థితుల నేపథ్యంలో, మన సాధారణ బలహీనతల నేపథ్యంలో క్రింద పేర్కొనబడిన గుణగణాల పట్ల ఇస్లామీయ కార్యకర్త ప్రత్యేకంగా దృష్టిని సారించవలసిన ఆవశ్యకత ఉంది:

### ☸ కఠినమైన నియమపాలన

క్యాంపస్‌లో పనిచేసే కార్యకర్త ఎట్టి పరిస్థితుల్లోనూ అబద్ధమాడని వ్యక్తిగా, అక్రమాలకు ఏమాత్రం పాల్పడని వ్యక్తిగా, పరీక్షల్లో కాపీకొట్టనివాడయి, చట్టవ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడని వ్యక్తిగా ఉండాలి.

### ☸ వాగ్దానపాలన

అతడు సమయాన్ని పాటించేవాడయి, ప్రతి చిన్న, పెద్ద వాగ్దానాన్ని భంగపరచనివాడయి, మామూలు ఒడంబడికకు కట్టుబడి ఉండడాన్నయినా విశ్వాసంలో భాగంగా భావించేవాడయి ఉండాలి.

### ☸ కామవాంఛల అదుపు

అతడు తన చూపును పరిరక్షించుకునేవాడయి, ఆడపిల్లలతో సంబంధాల్లో హద్దులు మీరనివాడయి ఉండాలి.

### ❁ నిజాయితీ మరియు ధర్మ పరాయణత

ప్రతి చిన్న, పెద్ద అమానతునూ (ఇతరులు దాచి ఉంచమని ఇచ్చిన డబ్బు లేదా వస్తువులు ) నిజాయితీతో పరిరక్షించేవాడయి, వ్యవహారాల్లో ఖచ్చితమైనవాడయి, ముఖ్యంగా అవినీతికి ఆమడ దూరంలో ఉండటమేకాక చిన్న పొరపాటును సైతం చేయకుండా ఉండేలా జాగరూకతతో వ్యవహరించేవాడయి ఉండాలి.

### ❁ సంబంధాలు

అతడు సహృదయం గలవాడయి, ప్రజలతో త్యాగబుద్ధితో వ్యవహరించేవాడయి, చాడీలు, పరోక్షనింద, ఇతరులను కించపరచడం, అసూయ, ఇంకా ఇతర దుర్గుణాలకు దూరంగా జీవించేవాడయి ఉండాలి.

### ❁ నైజం మరియు ప్రవర్తన

క్యాంపస్‌లో పనిచేసేందుకు సరియైన మనోవైఖరిని మరియు ప్రవర్తనను కలిగియుండటం తప్పనిసరి. మధ్యస్థమయిన మనోవైఖరిని కలిగియుండటమనేది ఇస్లాం బోధించే సుగుణాల్లో ఒకటి. క్యాంపస్‌లో పని చేసేందుకై ఇస్లాం ప్రబోధించిన మధ్యస్థమైన మనోవైఖరిని, ప్రవర్తనను కలిగియుండేందుకై మనం కృషి చేయవలసిన ఆవశ్యకత ఉంది. ఈ విషయంలో క్రింద పేర్కొనబడిన అంశాలు గుర్తుంచుకోదగ్గవి :

### ❁ సకారాత్మక మనోవైఖరి (Positive mental attitude)

మనం మన ఆలోచనలోనూ, ఆచరణలోనూ సకారాత్మకంగా, ఆశావాదులుగా (Optimistic) ఉండాలి. ఎవరయితే, వ్యవహారాలు, సంఘటనలు మొదలయిన అంశాల్లో కేవలం నకారాత్మక కోణాలపైనే తమ దృష్టిని కేంద్రీకరిస్తారో వారి ద్వారా నిర్మాణాత్మక కార్యాలు ఉనికిలోకి రావు. మనం వ్యక్తుల బలహీనతలపై, లోపాలపై కాకుండా వారి సుగుణాలపై మాత్రమే దృష్టిని కేంద్రీకరించడం సకారాత్మక దృష్టిగా పరిగణించ బడుతుంది. మనం సంఘటనలకు సంబంధించిన సకారాత్మక కోణాలు మరియు సంభావ్యతల గురించి మాత్రమే ఆలోచించాలి.

### ❁ విశాల దృష్టి మరియు సాహసోపేత వైఖరి

సంకుచిత దృష్టి కలవారు విద్యాలయాల్లో పని చేయలేరు. ఆదర్శనీయమైన

క్యాంపస్ వర్కర్ ఇస్లాం యొక్క సార్వత్రిక వైఖరిని, సమగ్ర చింతనాధోరణిని కలిగి యుండాలి. అన్నిరకాల వర్గ, ప్రాంతీయ, సైద్ధాంతిక పక్షపాతాలకూ అతీతంగా అతడు ఎదగాలి. తనను తీవ్రస్థాయిలో వ్యతిరేకించేవారి సుగుణాలనూ, ఔన్నత్యాలనూ అంగీకరించగల సంస్కారం అతడిలో ఉండాలి. తనలోనూ, తన సమీప సంబంధీకుల్లోనూ, తనకు ప్రియమైనవారిలోనూ ఉన్న బలహీనతలను, లోపాలను గ్రహించి అంగీకరించగల వైఖరిని అతడు కలిగియుండాలి. ఇతరులు తీవ్రస్థాయిలో రెచ్చగొడుతున్న సందర్భంలోనూ సంయమనాన్ని కోల్పోని ధీరోధాత్తత అతడిలో ఉండాలి. ఇతరుల పొరపాట్లను, తప్పులను క్షమించగల దయాగుణం అతడిలో ఉండాలి.

## ❁ చురుకైన ఆచరణాత్మక వైఖరి

మన క్యాంపస్ వర్కర్ చురుకైన ఆచరణాత్మక వైఖరిని కలిగియుండాలి. అతడు అత్యున్నతమైన స్వప్నాలు చూడటమే కాకుండా వాటిని నిజం చేసేందుకు తీవ్రంగా శ్రమించేవాడయి ఉండాలి. సరియైన ప్రణాళికలను రూపొందించడంలోనూ, వాటికి ఆచరణాత్మక రూపాన్ని కల్పించడంలోనూ అతడికి ఆసక్తి ఉండాలి. ఉన్నత స్థాయి వైజ్ఞానిక మరియు ఆలోచనాత్మక చర్చల్లో పాలుపంచుకునే ఆసక్తి సయితం అతడిలో ఉండాలి. తన ఆలోచనలకు ఆచరణాత్మక రూపాన్ని కల్పించేందుకై చురుకైన పాత్రను అతడు పోషించగలిగి ఉండాలి.

ఆచరణాత్మక వైఖరి అంటే అతడు పని చేసేవాడయి ఉండాలి. అంతేగాక అతడు చైతన్యవంతమైన, చురుకైన కార్యకర్త అయి ఉండాలి. అతడు తన సమయాన్ని సంపూర్ణంగా సద్వినియోగపరచుకునేవాడయి, విద్యార్థులకు సేవచేస్తూ వారి సమస్యలను పరిష్కరించేవాడయి ఉండాలి. కాలేజీకి చెందిన వివిధ వ్యవహారాల్లోనూ, వివాదాల్లోనూ అతడు ప్రేక్షకపాత్ర వహించేవాడిగా కాకుండా ముందడుగు వేసి నిర్మాణాత్మక దిశలో ఫలితాన్ని రాబట్టేందుకు కృషి చేసేవాడిగా, నాయకుడిగా ఉండాలి. అతడు తన విద్యాసంస్థలో ఎస్.ఐ.ఓ. ను స్థిరంగా అభివృద్ధిపరిచేందుకు కృషి చేసేవాడయి ఉండాలి. ఎక్కువ సంఖ్యలో అతడు సహచరులను, సన్నిహితులను కలిగియుండాలి. అలాగే సంస్థలో పాలుపంచుకునేవారిలో అతడి సహచరుల సంఖ్య వేగంగా పెరుగుతూ ఉండాలి. అతడికి చెందిన ముస్లిమేతర సహచరులు ఇస్లాం వైపునకు సమీపిస్తూ ఉండాలి. తన తోటి ముస్లిం విద్యార్థుల జీవితాల్లో పవిత్రమైన పరిణామాలు సంభవిస్తూ ఉండాలి. అతడు విద్యనభ్యసించే విద్యాసంస్థ వాతావరణం సకారాత్మక దిశ వైపునకు మరలుతూ ఉండాలి.

## ❁ యోగ్యత మరియు సామర్థ్యం

క్యాంపస్‌లో పని కొరకు జ్ఞానం మరియు యోగ్యతలు కూడా ఎంతో ఆవశ్యక మైనవి. కాబట్టి మనల్ని మనం యోగ్యులుగా, సమర్థులుగా, ఆదర్శనీయులుగా రూపొందించుకునేందుకై తీవ్రంగా శ్రమించాలి. జ్ఞానం మరియు సామర్థ్యాలు గొప్ప ఆకర్షణను కలిగియుంటాయి. ఒక సామర్థ్యమున్న, విజ్ఞాని అయిన విద్యార్థి తన తోటి యోగ్యులైన విద్యార్థులను తన వైపునకు ఆకర్షిస్తాడు. అతడు సంస్థ ప్రాభవాన్ని పెంచుతాడు. అలాగే సంస్థ పట్ల విశ్వసనీయతను (Credibility) జనింపజేస్తాడు.

◈ ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ విద్యారంగంలో మంచి రికార్డ్ ఉన్న, సామర్థ్యమున్న వాడయి ఉంటాడు. ఇదే అతడిలో అన్నింటికంటే మిన్నగా, విభిన్నంగా ఉండే సుగుణం. ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ తన సహచరులందరికంటే విద్యలో రాణించే విషయంలో ఉన్నతంగా ఉంటాడు. తన సబ్జెక్టుల్లో అతడికి అసాధారణ పరిజ్ఞానం ఉంటుంది. అతడు తన సహచరుల కొరకు ఒక మూలం (Resource Person)వలె ఉంటాడు.

◈ ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ ఇస్లాం పట్ల లోతయిన అవగాహనను, పరిజ్ఞానాన్ని కలిగియుంటాడు. ఇస్లాం యొక్క నియమనిబంధనలను మరియు విశ్వాసాలను పటిష్టమైన ఆధారాలతో పరిరక్షించే సామర్థ్యాన్ని కలిగియుంటాడు. ఇస్లాం మరియు అజ్ఞానాల మధ్య వ్యత్యాసాన్ని అతడు గుర్తించగలవాడయి ఉంటాడు. ఇస్లామీయ చింతన విషయంలో ఉనికిలోకి వచ్చిన విభేదాల పరిజ్ఞానాన్ని సయితం అతడు కలిగియుంటాడు. అలాగే వాటి విషయంలో జరుగుతున్న క్రొత్త క్రొత్త మార్పులను సయితం అవగాహన చేసుకోగలవాడయి ఉంటాడు.

◈ ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ అజ్ఞానం మరియు అజ్ఞానంతో కూడుకున్న ఆలోచనాధోరణుల పట్ల కూడా లోతయిన అవగాహనను, పరిజ్ఞానాన్ని కలిగియుంటాడు. పురాతన ఇస్లామేతర సిద్ధాంతాల పట్ల మాత్రమే కాకుండా ఆధునిక ఇస్లామేతర సిద్ధాంతాల పట్ల మరియు బూటకపు ఆలోచనాధోరణుల పట్ల కూడా స్పష్టమైన అవగాహనను కలిగియుంటాడు. అలాగే వాటికి వ్యతిరేకంగా ఇస్లాం ఔన్నత్యాన్ని స్థాపించే సామర్థ్యాన్ని సయితం అతడు కలిగియుంటాడు.

◈ ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ యొక్క విజ్ఞాన పరిధి చాలా విస్తృతంగా ఉంటుంది. అతడు Master of one తప్పక అయి ఉంటాడు. కానీ Jack of All కూడా అయి ఉంటాడు. ప్రతి అంశంపై ఎంతోకొంత అవగాహనను అతడు తప్పక కలిగి యుంటాడు. రాజకీయ రంగం, ఆర్థిక రంగం, సామాజిక రంగం, మతం, నైతిక వ్యవస్థ, కళ, సంస్కృతులు, టెక్నాలజీ, చిత్రకళ, హాస్యం ... ఇలా ఏ రంగంలోనయినా అతడికి ప్రవేశం ఉంటుంది. అతడు ప్రతి సభకూ ముఖ్య ఆకర్షణగా, కేంద్రబిందువుగా వెలుగొందుతాడు. అతడు అన్ని రకాల వ్యవహారాలనూ అర్థం చేసుకోగలిగి వాటి పట్ల తన అభిప్రాయాలను స్పష్టమైన రీతిలో వెలిబుచ్చగల సామర్థ్యాన్ని కలిగియుంటాడు.

## ☸ సమగ్ర వ్యక్తిత్వం

ఈ విధంగా రూపొందే ఆదర్శనీయమైన క్యాంపస్ వర్కర్ యొక్క సమగ్ర వ్యక్తిత్వపు ముఖచిత్రం ఎంతో రమణీయంగా ఉంటుంది. దానినే పవిత్ర ఖుర్ఆన్ ఆదర్శనీయమైన విశ్వాసి ముఖచిత్రంగా పేర్కొంటుంది.

అతడు నియమపాలన కలవాడు, తన ఆలోచనలపై స్థిరంగా నిలబడేవాడు, సత్యసంధుడు, సహనశీలుడు, ప్రాభవంగలవాడు, సజీవ హృదయుడు, పొంగిపొరలే ఉత్సాహం కలవాడు, కలుపుగోలుతనం కలవాడు, అందరినీ ప్రేమించేవాడు, పటిష్టమైన వైఖరి కలవాడు, వాగ్దానపాలన చేసేవాడు, ఆడినమాట తప్పనివాడు, న్యాయశీలుడు, ఔన్నత్యం గలవాడు, విశాల దృష్టి కలవాడు, సకారాత్మక మనోవైఖరి కలవాడు, సకారాత్మక ఆచరణాత్మక వ్యవహార సరళి కలవాడు, నిత్యచైతన్యశీలుడు, నిత్య సంసిద్ధుడు, కాలేజీ సమస్యల విషయంలో నాయకత్వ పాత్రను పోషించేవాడు మరియు తన లక్ష్యసాధన కొరకు నిత్యం పరిశ్రమించేవాడు.

ఈ సుగుణాలన్నీ అతడు సత్యసంధుడయిన విశ్వాసి అయిన కారణంగానే అతడిలో పాదుకొని ఉంటాయి. అతడు అల్లాహ్‌పై అచంచల విశ్వాసాన్ని, ఆయనతో పటిష్టమైన సంబంధాన్ని కలిగి ఉండేవాడు, ఆయనకు భయపడేవాడు, దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ పట్ల అవ్యాజమైన ప్రేమను కలిగియుండటమే కాకుండా ఆయనను అనుసరించేవాడయి ఉంటాడు.

## క్యాంపస్ వర్క్‌లో శిక్షణ

క్యాంపస్‌లో పని చేసేందుకై మన సంబంధీకులకు మంచి శిక్షణను అందించాలి. జోన్‌లు మరియు యూనిట్లు ఈ లక్ష్యసాధన కొరకై మన సాధారణ శిక్షణాకార్యక్రమాలే కాకుండా ప్రత్యేకమైన కార్యక్రమాలను రూపొందించుకోవాలి. క్యాంపస్ వర్క్‌లో శిక్షణ గరిపేందుకు అవసరమయ్యే ప్రణాళికకు సంబంధించిన మౌలిక లక్ష్యాలు క్రింద పేర్కొనబడుతున్నాయి:

(1) క్యాంపస్‌లో పనికి సంబంధించిన మన లక్ష్యాలు, ఆశయాలు, విధానాలు మరియు నియమనిబంధనల పట్ల లోతయిన అవగాహనను పెంపొందించడం.

(2) ఆచరణాత్మక విధానాల్లో శిక్షణ ఇవ్వడం.

(3) రాబోయే సమస్యలను ఎదుర్కొనే మరియు వాటిని చక్కగా పరిష్కరించగల సామర్థ్యాన్ని పెంపొందించడం.

(4) విద్యార్థుల అవసరాలు, విద్యాపరమైన సమస్యలు, విద్యావ్యవస్థ మొదలయినవాటి పట్ల అవగాహనను, పరిజ్ఞానాన్ని పెంపొందించడం.

(5) క్యాంపస్‌లో పని చేసేందుకు అవసరమయ్యే ఆత్మస్థయిర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, ముందడుగు వేసే తత్వాన్ని (Initiative), శ్రమించే స్వభావం (Struggle) నిత్య సంసిద్ధతను విద్యార్థుల్లో జనింపజేయడం.

మీరు చదువుతున్న 'క్యాంపస్‌లో సందేశం' అనే పుస్తకం దేశంలోని సర్వసామాన్య పరిస్థితులను, పైన పేర్కొనబడినవాటిలో ఒకటవ మరియు రెండవ లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని రాయబడింది. నాల్గవ లక్ష్యం విషయంలో మూలాలను గురించి తెలియజేయడం జరిగింది. అయితే మూడవ మరియు ఐదవ లక్ష్యాలు ఆచరణాత్మక కార్యకలాపాల ద్వారా మరియు శిక్షణకు సంబంధించిన ఆచరణాత్మక విధానాల ద్వారా మాత్రమే నెరవేరగలవు.

ఈ విషయంలో ముఖ్యమైన సలహా ఏమిటంటే జోన్ స్థాయిలో అవసరమయినప్పుడల్లా ఈ లక్ష్యసాధన కొరకు శిక్షణ క్యాంపును నిర్వహించాలి. అలాగే యూనిట్ స్థాయిలోనూ సంవత్సరానికొకసారి (విద్యాసంవత్సరం ప్రారంభమవడానికి ముందు) లేదా రెండుసార్లు క్యాంపులను నిర్వహించాలి. ఆ క్యాంపుల్లో పైన పేర్కొనబడిన లక్ష్యాలను

ఆధారంగా చేసుకొని వ్యక్తులకు శిక్షణ ఇవ్వాలి. ఆ సందర్భంలో ఈ పుస్తకాన్ని మార్గదర్శిగా వినియోగించుకోవాలి. అయితే స్థానిక సమస్యలను మరియు పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని ఆవశ్యకమైన మార్పులను, చేర్పులను చేసుకోవాలి.

**క్యాంపుల్లో క్రింద పేర్కొనబడిన ప్రోగ్రాములు నిర్వహించవచ్చు :**

(1) పేర్కొనబడిన లక్ష్యాలను ఆధారంగా చేసుకొని వివిధ అంశాలపై లెక్చర్లు.

(2) విజయం సాధించిన మాజీ క్యాంపస్ వర్కర్ల అనుభవాలు.

(3) వివిధ సమస్యలపై Case Studies.

(4) పనికి సంబంధించిన కార్యాచరణ విధానాన్ని పరిశీలించేందుకై Brain Storming సెషన్లు.

(5) నిపుణుల ద్వారా క్యాంపస్ లో పనిచేసేవారి ఆచరణాత్మక సమస్యలపై కౌన్సిలింగ్.

అయితే ఇక్కడ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఇటువంటి క్యాంపుల ద్వారా చైతన్యం పెంపొందుతుంది, పని విధానాలేమిటో తెలుస్తాయి, పనిచేయడానికి అవసరమైన స్ఫూర్తి లభిస్తుంది. కానీ అసలయిన శిక్షణ ఆచరణాక్షేత్రంలో ఆచరణాత్మక కార్యకలాపాల ద్వారా మాత్రమే లభిస్తుంది. ఒకవేళ పనిచేయడంలో సంకోచం ఉన్నట్లయితే ముందుగా ఆ సంకోచాన్ని, ఆత్మన్యూనతాభావనలను, బిడియాలను తొలగించుకోవడమే లక్ష్యం కావాలి. ఈ లక్ష్యసాధన కొరకు జోన్‌లు మరియు యూనిట్లకు చెందిన బాధ్యులు క్రింద పేర్కొనబడిన చర్యలను చేపట్టాలి:

(i) విద్యార్థులను విద్యాసంస్థలో తమతోపాటు తీసుకెళ్ళాలి. జోన్‌కు చెందిన బాధ్యులు బలహీనమైన యూనిట్ల పర్యటనల్లో, స్థానిక యూనిట్ బాధ్యులు తమ దైనందిన కార్యకలాపాల్లో అక్కడ సంస్థ సంబంధీకులనే కాకుండా అక్కడి విద్యార్థులను కూడా కలసుకొని ప్రోగ్రాములు నిర్వహించాలి. విద్యార్థుల సమస్యలను పరిష్కరించేందుకై వీలయినంతగా ప్రయత్నించాలి. ఆ క్రమంలో క్రమానుగతంగా శిక్షణలో ఉన్న విద్యార్థులను పురోగమింపజేస్తూ వారి ద్వారా పని చేయించాలి.

(ii) ఏ ఏ యూనిట్లలో లేదా జోన్‌లలోనయితే క్యాంపస్ పని స్థిరంగా, ఉత్తమ స్థాయిలో ఉందో అక్కడి కార్యకర్తలతో కలసి పనిచేస్తూ అనుభవాన్ని గడించే నిమిత్తం విద్యార్థి బృందాలను కొన్నిరోజుల కొరకు అక్కడికి పంపించాలి.

(iii) మంచి మంచి విద్యార్థి సేవావిభాగాలను (బుక్ బ్యాంకులు, లైబ్రరీలు, క్లాసులు, గైడెన్స్ సెల్స్ మొదలయినవి) వారికి చూపించి వాటి నిర్వహణావ్యవస్థలను అధ్యయనం చేయించాలి. ఆ విభాగాలు సంస్థకు చెందిన ఇతర యూనిట్ల తరపు నుంచి ఏర్పాటుచేయబడినవైనా కావచ్చు లేదా ఇతర ముస్లిం మరియు ముస్లిమేతర పురోభివృద్ధి సంస్థలయినా కావచ్చు.

(iv) వారు అప్పుడప్పుడూ కాలేజీకి చెందిన చైతన్యవంతులైన విద్యార్థులను మరియు నాయకులను (వారు మనకు బద్ధవ్యతిరేకమైన సంస్థలకు చెందినవారైనప్పటికీ) కలసుకునేలా, వారితో సమయం గడిపేలా ప్రోత్సహించాలి.

(v) శిక్షణ పొందుతున్న విద్యార్థులకు వారానికొకసారి లేదా నెలకొకసారి ఆచరణాత్మక కార్యాలను (Assignments) అప్పగించి వాటిని సమీక్షించాలి. (ఉదాహరణకు ఎవరినయినా కలుసుకునే కార్యక్రమం, ఏదయినా ప్రోగ్రామ్‌ను నిర్వహించే పని, ఏదయినా సమస్యను అధ్యయనం చేసే బాధ్యత మొదలగున్నవి)

(vi) క్యాంపస్‌లో పనికి సంబంధించిన బాధ్యతను కేవలం సీనియర్ విద్యార్థులపైనే మోపకూడదనే విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. ఎందుకంటే వారు విద్యాభ్యాసాన్ని ముగించి నిష్క్రమించగానే ఆ పనికి సంబంధించిన బాధ్యతల విషయంలో పెద్ద లోటు ఏర్పడుతుంది. హయ్యర్ సెకండరీ స్కూల్ (11వ, 12వ లేదా ఇంటర్ చదివే విద్యార్థులు) విద్యార్థులను మరియు యూనివర్శిటీలో ప్రారంభపు తరగతులు చదివే విద్యార్థులను అభివృద్ధిపరచి వారికి క్రమానుగతంగా నాయకత్వం వహించడంలో శిక్షణ ఇచ్చేందుకు ప్రణాళికాబద్ధంగా కృషి చేయాలి. అలా చేసినట్లయితే క్యాంపస్‌లో నాయకత్వ పరంపర స్థిరంగా కొనసాగుతుంది.

(vii) వివిధ విద్యార్థులకు క్యాంపస్‌లో ప్రత్యేకమైన పనులు చేసేందుకుగాను ప్రత్యేకమైన శిక్షణను అందించాలి. ఈ విధమైన ప్రత్యేక శిక్షణను క్రింద పేర్కొనబడిన రంగాల్లో ఇవ్వవచ్చు:

▣ క్యాంపస్‌లో పనికి సంబంధించిన ఆచరణాపరమైన అవసరాల కొరకు : ఉదాహరణకు విద్యావ్యవస్థ అధ్యయనం, వివిధ తీర్పులపై దృక్పథాన్ని కలిగియుండటం, వాటిని ఆధారాలతో నిరూపించడం, యూనివర్శిటీల్లోనూ, కాలేజీల్లోనూ జరిగే విభిన్న చర్చల్లో సంస్థ తరపు నుంచి ప్రాతినిధ్యం వహించడం మొదలయినవి.

▣ సృజనాత్మక కార్యకలాపాలు : పోస్టర్లు అంటించడం, హ్యాండ్ బిల్లులు రాయడం, వాల్ మేగజైన్లు రూపొందించడం, స్టిక్కర్లు డిజైన్ చేయడం మొదలయినవి.

▣ చట్టపరమైన కార్యకలాపాలు : యూనివర్శిటీ స్థాయిలో లేదా న్యాయస్థానాల స్థాయిలో వివిధ చట్టపరమైన వ్యవహారాలను చూడటం.

▣ ఎడ్యుకేషనల్ గైడెన్స్ : విద్యార్థులకు విద్యాపరమైన మార్గనిర్దేశనం చేయడం.

▣ స్కాలర్‌షిప్ గైడెన్స్ : విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లకు సంబంధించి పూర్తి సలహాలను, సమాచారాన్ని అందించడం.

▣ వసతి గృహాలను పొందే విషయంలో మార్గనిర్దేశనం చేయడం.

▣ కాలేజీల్లోనూ, యూనివర్శిటీల్లోనూ వివిధ కార్యాలయాలకు సంబంధించిన లావాదేవీల విషయంలో మార్గదర్శకత్వాన్ని, సహకారాన్ని అందించడం.

▣ తజ్‌కియహ్ (సంస్కరణ) మరియు శిక్షణకు సంబంధించిన పనులు.

▣ సాంస్కృతిక కార్యకలాపాలు, కళలు, సాహిత్యం, చిత్రలేఖనం మొదలయిన వాటికి సంబంధించిన నిపుణులు, కాలేజీ సంస్కృతిలో ప్రభావవంతమైన ప్రాతినిధ్యం వహించేవారు.

▣ క్రీడల్లో శిక్షణ ఎందుకంటే క్రీడల పట్ల ఆసక్తి ఉన్నవారికి సయితం సంస్థ పరిచయమవుతుంది.

▣ సామాజిక సేవ (ఎన్.ఎస్.ఎస్. మొదలయినవి), ఎన్.సీ.సీ. మొదలయినవాటిలో ప్రత్యేకమైన ప్రతిభ చూపే సామర్థ్యమున్నవారు.

▣ అకాడమీలు కాలేజీకి సంబంధించిన వివిధ అకడమిక్ కార్యకలాపాల్లోనూ, సభల్లోనూ అత్యుత్తమ ప్రతిభను ప్రదర్శించే సామర్థ్యమున్నవారు.

ఈ అవసరాలను క్రొత్త విద్యార్థుల్లో పని చేసే సమయంలో కూడా గుర్తుంచు కోవాలి. ఏ విద్యార్థుల ద్వారానయితే ఈ అవసరాల పరిపూర్తి జరుగుతుందో వారిపై పనిచేయాలి. అలాగే ఈ అవసరాలను దృష్టిలో ఉంచుకుంటూ ప్రత్యేకమైన శిక్షణకు సంబంధించిన ప్రణాళికను అమలు చేసేందుకు సయితం కృషి చేయాలి.

## ❁ ఈ విషయాలకు దూరంగా ఉండండి

(1) కాలేజీలో మీ ముఖచిత్రం నియమబద్ధమైన, సైద్ధాంతికమైన, మరియు ఇస్లామీయ సంస్థకు చెందినదయి ఉండాలి. వేర్పాటువాద, కుల ప్రయోజనాలకు పాకులాడే సంస్థకు చెందినదయి ఉండరాదు. మన కృషి మరియు పనితీరు ఎలా ఉండాలంటే ప్రతి వర్గానికి చెందిన వ్యక్తీ మన పనిని తమదిగా భావించాలి. అందరి సమంజసమైన ప్రయోజనాలకూ వాటి నిష్పత్తి ప్రకారం, వివక్షకు తావు లేకుండా ప్రాతినిధ్యం కల్పించాలి.

(2) కేవలం ముస్లింలకు సంబంధించిన అంశాలను గురించి మాట్లాడుతూ ముస్లింల వ్యవహారాల పట్ల మాత్రమే ఆసక్తిని కలిగియుండే వైఖరికి స్వస్తి చెప్పండి.

(3) 'ఇస్లాం' మరియు 'నైతికత'ల గురించి పదే పదే వివేకరహితంగా ప్రకటనలతో హోరెత్తించరాదు. అలా చేసినట్లయితే ప్రజలు ఇస్లాంకు దగ్గరగా రావడానికి బదులు ఇస్లాం పట్ల వైముఖ్యాన్ని ప్రదర్శించే అవకాశం ఉంది. ఇస్లాం కోరేవిధంగా ప్రజల్లో మార్పు తీసుకురావడమే మన అసలు లక్ష్యం. ఈ పని సహజమైన క్రమబద్ధతతో, వివేకంతో మాత్రమే సాధ్యమవుతుంది.

(4) అంటీముట్టనట్లు ఉండే పొడి వైఖరిని 'తఖ్వా' (దైవభీతి) గా పొరబడకండి. విద్యార్థుల వయస్సును, వారి మనోవైఖరులను దృష్టిలో ఉంచుకొని వాటికి అనుగుణంగా మీలోనూ, మీ సభల్లోనూ ఆకర్షణను, వినోదాత్మక వైఖరిని, జనరంజకత్వాన్ని జనింప జేసుకోలేనట్లయితే మీరు విద్యార్థులను ఆకర్షించలేరు, వారిలో పని చేయలేరు.

(5) మీతో సంబంధాన్ని కలిగియున్న విద్యార్థుల్లో ఆకస్మిక మార్పులను చూడాలనే కాంక్షను విడనాడండి. దోషాలు మరియు బలహీనతల ప్రాతిపదికన ప్రజల పట్ల ద్వేషం పెంచుకోకండి. క్రమంగా, వివేకంతో సంస్కరణ కొరకు ప్రయత్నించండి.

(6) కాలేజీ కార్యకలాపాల్లో ( గ్యాదరింగ్, స్పోర్ట్స్ మొదలయినవి ) తప్పనిసరిగా పాల్గొనండి. మంచి కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనడం ద్వారా మాత్రమే మీరు క్రమంగా అసమంజసమైన ప్రోగ్రాముల పరంపరను సమాప్తం చేయగలరు.

(7) మీరు కేవలం ధర్మపరాయణులైన విద్యార్థులను మాత్రమే లక్ష్యంగా ఎంచుకోకండి. ఇస్లామీయ ఉద్యమానికి ప్రయోజనకరమైన వ్యక్తులు మనకు ధర్మపరాయణుల వర్గానికి వెలుపలే లభించారనే సంగతిని మనం మరచిపోరాదు.

(8) తీవ్రవాదానికి, అతివాదానికి దూరంగా ఉండండి. దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స.అ.స.) పేర్కొన్న ఈ వాక్యాన్ని సదా గుర్తుంచుకోండి : **"యస్సిరూ వలా తుఅస్సిరూ వలా తునఫ్ఫిరూ"** (సౌలభ్యం కలుగజేయండి, కఠినంగా మార్చకండి మరియు ప్రజలను విద్వేషులుగా మార్చకండి).

(9) సంస్థకు చెందినవారిలో కొంతమందితో విడిగా ఒక వర్గాన్ని రూపొందించుకోవడం, వారితోనే గడపడం, వారితోనే తిరగడం మొదలయినవాటికి దూరంగా ఉండండి. మీ సన్నిహితుల వర్గాన్ని విస్తృతంగావించండి. అన్నిరకాల ఆంక్షలకూ అతీతంగా ప్రజలతో సంబంధాలను పెంపొందించుకోండి.

(10) మీ సభలను నిత్యం ప్రత్యేకమైన మతపరమైన చర్చలకు వేదికగా మలచకండి. చర్చించదగిన అంశాల పరిధిని విస్తృతం కావించండి. ఇస్లామీయ ధర్మశాస్త్రపు హద్దుల్లో ఉంటూనే మీ సభలు అన్ని రకాల ఆసక్తులను, మనోవైఖరులను కలిగియున్నవారికి కేంద్రాలుగా ఉండాలి.

(11) ఇస్లామీయ ధర్మశాస్త్ర శాఖలకు (మసాలిక్) సంబంధించిన వివాదాస్పదమైన చర్చల్లో నిమగ్నులు కాకండి. ఇస్లామీయ ఉద్యమం ఏ ఒక్క ప్రత్యేకమైన ధర్మశాస్త్ర శాఖ (ఫిఖ్హీ మస్లక్)కూ ప్రత్యేకించబడినది కాదు. ప్రపంచంలోని ప్రామాణికమైన ఇస్లామీయ పండితుల్లో ఇస్లామీయ ధర్మశాస్త్రం విషయంలో ఎన్ని రకాల అభిప్రాయాలున్నాయో అన్నింటికీ మన వద్ద అవకాశం ఉంటుంది. ఎటువంటి ధార్మిక శాఖకు (మస్లక్) చెందిన వ్యక్తయినా మనతో సంబంధాన్ని ఏర్పరచుకోగలడు.

(12) అభిప్రాయభేదాన్ని వివాదంగా మార్చకండి. అభిప్రాయాలతో విభేదించండి. కానీ చర్చను వివాదాస్పదంగా మార్చి ఉద్రేకపూరితమైన వాతావరణాన్ని ఏర్పరచకండి. వివాదం పట్ల భయంతో ఆరోగ్యకరమైన అభిప్రాయభేదాన్ని విడనాడకండి. ఆరోగ్యకరమైన సామూహిక వాతావరణం కొరకు ఆరోగ్యకరమైన అభిప్రాయభేదమూ ఆవశ్యకమే. అయితే అభిప్రాయభేదాన్ని ఉద్రేకపూరితమైన జగడం వైపునకు మరల్చకండి.

(13) మీలో మీరే ముడుచుకుపోతూ, ఒంటరిగా మీతో మీరే గడపకండి. ప్రతి ఒక్కరితోనూ కలవండి, ప్రతి ఒక్కరినీ పరిశీలించండి, మీ అనుభవాల పరిధిని విస్తృతంగావించండి.

(14) సంస్థాగతమైన పారిభాషిక పదాలను, కార్యాలయ సంబంధిత విషయాలను సంస్థ లోపలే ఉంచండి. మీకు మరియు సామాన్య ప్రజలకూ మధ్య సంస్థకు సంబంధించిన కార్యాలయ సంబంధిత విషయాలు మరియు పారిభాషిక పదాలతో కూడిన పరదాలను ఏర్పరచకండి. ఉదాహరణకు 'మనం జెడ్.ఏ.సీ. మీట్‌లో వెళ్ళవలసి ఉంది', 'ఈ పని నాది కాదు, కాలేజ్ ఆర్గనైజర్‌కు సంబంధించినది', 'ఈ పనికి జోన్ నుంచి అనుమతి లభించలేదు' మొదలయిన సంస్థాగత పారిభాషిక పదాలతో కూడిన వాక్యాలు సంస్థ సంబంధీకుల నడుమ ఉపయోగించవలసినవి. అంతేగానీ సామాన్య ప్రజలను ఉద్దేశించి వినియోగించవలసినవి కావు.



29

# సాధారణంగా ఎదురయ్యే ప్రశ్నలు

**ప్రశ్న:** ముస్లిం మరియు ముస్లిమేతర విద్యార్థులుండే కాలేజీలో సందేశం మరియు తజ్కియహ్ (సంస్కరణ)కు సంబంధించిన కార్యకలాపాల్లో సమతుల్యతను ఎలా సాధించవచ్చు. రెండు రకాల ప్రోగ్రాముల్లోనూ వ్యత్యాసాన్ని ఏ విధంగా గుర్తించవచ్చు ?

**జవాబు:** ఇది ఎంతో క్లిష్టమైన ప్రశ్న. ముస్లిం విద్యార్థుల్లో చేయవలసిన పని వేరుగా ఉంటుంది, ముస్లిమేతర విద్యార్థుల్లో చేయవలసిన పని వేరుగా ఉంటుంది. రెండు రకాల పనులనూ మనం ఒకే కాలేజీలో సమ్మిళిత వర్గంలో చేయవలసి ఉంటుంది. దానికి సంబంధించిన ఆచరణాత్మక రూపం ఇలా ఉంటుంది :

● సందేశాత్మక ప్రోగ్రాముల గురించి ప్రచారం చేయాలి. అందరికీ సమావేశంలో పాలుపంచుకొనవలసిందిగా ఆహ్వానించాలి. కానీ వ్యక్తిగత పని, ప్రత్యేకంగా ఇస్లాం సందేశాన్ని అందించడం, సమావేశంలో హాజరుపరిచే కృషి ముస్లిం విద్యార్థుల మధ్య కొనసాగించాలి.

● ఒకవేళ కాలేజీ పెద్దదయితే, ముస్లిం విద్యార్థుల సంఖ్య అందులో పెద్దగా లేనట్లయితే తజ్కియహ్ (సంస్కరణ) ప్రోగ్రాములకు సంబంధించిన ప్రచారాన్ని బహిరంగంగా నిర్వహించకుండా మౌఖిక ప్రచారాన్ని (Mouth Publicity) నిర్వహించాలి. వ్యక్తిగత పని ద్వారా విద్యార్థులను ప్రోగ్రాములో హాజరుపరిచేందుకు కృషి చేయాలి.

కాలేజీ లోపల ముస్లిం విద్యార్థులకు సంబంధించిన ప్రత్యేక ప్రోగ్రాముల నిర్వహణ పట్ల అపోహలు ఏర్పడే ప్రమాదమున్నట్లయితే కాలేజీ బయట (దగ్గరలో ఉన్న మసీదులోనయితే మంచిది) అటువంటి ప్రోగ్రాములు నిర్వహించవచ్చు. ఒకవేళ ముస్లిమేతరుడెవరయినా స్వయంగా ఆసక్తితో ప్రోగ్రాములో పాల్గొనాలనుకుంటే అతడిని అడ్డుకోరాదు.

● ఎన్నో రకాల ప్రోగ్రాముల ద్వారా ఒకే సమయంలో రెండు (తజ్కియహ్ మరియు సందేశం) లక్ష్యాలను సాధించవచ్చు. ఉదాహరణకు ఫోరమ్‌లు, ప్రత్యేక దినోత్సవాలకు సంబంధించిన ప్రోగ్రాములు, పోటీలు, వినోదాత్మక కార్యక్రమాలు మొదలయిన కార్యక్రమాల గురించి ఇంతకుముందే పేర్కొనబడ్డాయి. ఈ ప్రోగ్రాములు తజ్కియహ్ మరియు సందేశం కొరకు విడివిడిగా ప్రోగ్రాములనూ నిర్వహించవచ్చు లేదా

ఒకే ప్రోగ్రామ్‌లో ముస్లిం మరియు ముస్లిమేతర విద్యార్థులను హాజరుపరిచి వివేకంతో సందేశం మరియు సంస్కరణ (తజ్‌కియహ్) అనే రెండు లక్ష్యాలను ఒకే సమయంలో సాధించవచ్చు.

**ప్రశ్న:** తజ్‌కియహ్ (సంస్కరణ) కు సంబంధించిన కార్యకలాపాలను విద్యాలయం లోపల కొనసాగించాలా? నగర స్థాయిలో విద్యార్థులు నివసించే ప్రాంతాల్లో నిర్వహించబడే కార్యకలాపాలకూ, విద్యాలయాల లోపల నిర్వహించబడే కార్యకలాపాలకు మధ్య సమతుల్యాన్ని ఏవిధంగా సాధించవచ్చు? దానికి సంబంధించిన ఆచరణాత్మక రూపం ఏమిటి?

**జవాబు:** కాలేజీ విద్యార్థుల మనోవైఖరులను తీర్చిదిద్దడమే మన 'తజ్‌కియహ్' (సంస్కరణ) ప్రోగ్రామ్ యొక్క అసలు లక్ష్యం. ఈ పనిని ఏ విధంగా వీలయితే ఆ విధంగా, ఏ రూపంలో సౌలభ్యముంటే ఆ రూపంలో నిర్వహించవచ్చు.

స్థానిక పరిస్థితులు, సమస్యలు మరియు విద్యార్థుల సౌలభ్యాలను దృష్టిలో ఉంచుకొని క్రింద పేర్కొనబడినవాటిలో నుంచి ఏదో ఒక రూపాన్ని స్వీకరించవచ్చు :

● ఒకవేళ కాలేజీ పరిస్థితులు అనుమతిస్తున్నట్లయితే, అక్కడ మన సంబంధీకుల సంఖ్యాబలం ఉన్నట్లయితే కాలేజీ యూనిట్‌ను ప్రత్యేకమైన యూనిట్‌గా పరిగణించవచ్చు. అటువంటి పరిస్థితిలో నగరానికి చెందిన యూనిట్‌తో దానికి ఎటువంటి సంబంధమూ ఉండదు. అది స్వేచ్ఛగా కాలేజీలో లేదా హాస్టల్‌లో లేదా కాలేజీ సమీపంలో ఏదయినా మసీదులో లేదా ఎక్కడ వీలయితే అక్కడ తన తజ్‌కియహ్ (సంస్కరణ) కు సంబంధించిన కార్యక్రమాలను నిర్వహిస్తుంది. అటువంటి కాలేజీ యూనిట్ సంబంధీకులు నగరానికి చెందిన యూనిట్ వ్యవస్థతో ఎటువంటి సంబంధాన్నీ కలిగియుండరు. వారు తమ కాలేజీ యూనిట్‌కు చెందినవారుగా పరిగణించబడతారు. వారు కాలేజీ యూనిట్ వ్యవస్థకు లోబడి జవాబుదారులుగా ఉంటారు.

సాధారణంగా ఇటువంటి రూపం రెసిడెన్షియల్ కాలేజీల్లోనూ, యూనివర్శిటీల్లోనూ, హాస్టళ్ళలోనూ ప్రయోజనకరంగా రూపొందుతుంది. నగరంలో నివసించే విద్యార్థుల సమయంలో ఎక్కువ భాగం తమ వాడలో లేదా కాలనీలో గడుస్తుంది. కాబట్టి వారి కొరకు ఈ రూపం ప్రయోజనకరం కాజాలదు.

● రాకపోకల సమస్యలు లేని చిన్న చిన్న పట్టణాల్లో లేదా గ్రామాల్లో ఉండే కాలేజీల్లోనూ, యూనివర్శిటీల్లోనూ వ్యక్తిగత పని, విద్యార్థులకు సేవ చేయడం, వారి

సమస్యలను పరిష్కరించడం, సహపాఠ్య కార్యకలాపాల్లో పాల్గొనడం మొదలయినవాటిని నిర్వహించవచ్చు. తజ్‌కియహ్(సంస్కరణ)కు సంబంధించిన కొన్ని ముఖ్యమైన మరియు సామాన్య ప్రోగ్రాములను కాలేజీ లోపల లేదా కాలేజీ సమీపంలో నిర్వహించాలి. తజ్‌కియహ్‌కు సంబంధించిన మిగిలిన కార్యకలాపాలను స్థానిక యూనిట్ తరపున యూనిట్ స్థాయిలో నిర్వహించుకోవాలి. ఈ విధంగా కాలేజీలో లేదా క్యాంపస్‌లో విద్యార్థులకు సేవ చేయడం మరియు వారిని సంస్థకు చేరువ చేయడమనే కార్యాలను నిర్వహించవచ్చు. తజ్‌కియహ్ (సంస్కరణ)కు సంబంధించిన కార్యక్రమాలను స్థానిక యూనిట్ స్థాయిలో పట్టణంలో నిర్వహించాలి.

● పెద్ద నగరాల్లోనూ ఈ విధానమే అవలంబించవచ్చు. అయితే ఇక్కడ రెండు రకాల వ్యవస్థలను ఏర్పాటు చేయాలి. కాలేజీలో క్యాంపస్ పనికి సంబంధించిన వ్యవస్థ నేరుగా నగర స్థాయి బాధ్యునికి లేదా క్యాంపస్ ఆర్గనైజర్‌కు జవాబుదారీగా ఉంటుంది. అలాగే వాడ స్థాయిలో విద్యార్థుల వసతి గృహాల్లో పనికి సంబంధించిన వ్యవస్థ కాలేజీ స్థాయి బాధ్యునికి జవాబుదారీగా ఉంటుంది. ఈ వ్యవస్థలు విద్యార్థులకు సేవ చేయాలి, వారిని చేరదీయాలి, వారిని ప్రభావితం చేయాలి, తజ్‌కియహ్‌కు సంబంధించిన తాత్కాలిక కార్యక్రమాలను కాలేజీలో లేదా కాలేజీ సమీపంలో నిర్వహించాలి. పరిచయమయిన విద్యార్థులను వారికి సంబంధించిన వసతి గృహాల వ్యవస్థకు అప్పగించాలి. తద్వారా వారు అక్కడ జరిగే స్థిరమైన తజ్‌కియహ్ కార్యక్రమాల్లో (వారాంతపు సమావేశాలు, శిక్షణా సమావేశాలు) పాల్గొనగలరు.

ఈ విధానం వసతి గృహాల్లో పనిచేసే యూనిట్లకు మరియు కాలేజీలో పనిచేసే వ్యవస్థకు మధ్య చక్కని సంబంధాలు (Co-ordination) ప్రభావవంతమైన సమాచార ప్రసార వ్యవస్థలు (Effective Communication Systems) ఉన్నప్పుడే విజయవంత మవుతుంది.

● ఇక తజ్‌కియహ్ మరియు సందేశ ప్రచారానికి సంబంధించిన చివరి విధానమేమిటంటే తజ్‌కియహ్ (సంస్కరణ)కు సంబంధించిన పూర్తి వ్యవస్థ వాడల స్థాయిలోనూ, కాలేజీ స్థాయిలోనూ జరగాలి. వాడల్లో పరిచయమయ్యే విద్యార్థులను వాడల్లో జరిగే కార్యక్రమాల్లో హాజరుపరచాలి. కాలేజీలో పరిచయమయ్యే విద్యార్థులను కాలేజీలో జరిగే కార్యక్రమాల్లో హాజరుపరచాలి.

ఈ విధానంలో ఉన్న ముఖ్యమైన లోపమేమిటంటే, కొంతమంది విద్యార్థులు ఒకే సమయంలో ఎస్.ఐ.ఓ.కు చెందిన రెండు గ్రూపులకు (వాడకు చెందిన గ్రూపు మరియు కాలేజీకి చెందిన గ్రూపు) పరిచయమవుతారు. మన సంస్థ సంబంధీకులు రెండు తజ్కియహ్ వ్యవస్థల ప్రకారం (కాలేజీ స్థాయి వ్యవస్థ మరియు వాడ స్థాయి వ్యవస్థ) నడచుకోవలసి వస్తుంది. ఆ విధంగా వారికి పరిచయమయిన విద్యార్థులు రెండు స్థానిక వ్యవస్థలకు చెందినవారుగా రూపొందుతారు.

మా ఉద్దేశ్యంలో ఈ నాల్గవ విధానాన్ని తప్పనిసరి పరిస్థితుల్లో మాత్రమే స్వీకరించ వచ్చు. ఒకటి లేదా మూడవ విధానాల్లో ఒకదానిని ఎంపిక చేసుకోవడం మంచిది.

**ప్రశ్న:** విద్యార్థినుల్లో సందేశ ప్రచారం విషయమై సంబంధాల హద్దులేమిటి? క్యాంపస్‌లో సందేశం మరియు తజ్కియహ్‌కు సంబంధించిన పనుల విషయంలో వారి పట్ల మన వైఖరి ఎలా వుండాలి?

**జవాబు:** మన సంస్థ ప్రాథమికంగా విద్యార్థులకు చెందిన సంస్థ. విద్యార్థినుల కొరకు జీ.ఐ.ఓ. పేరుతో మన అనుబంధ సంస్థ నడుస్తోంది. కాబట్టి విద్యార్థినుల్లో సందేశం మరియు తజ్కియహ్ పనులను మనం నేరుగా చేయకూడదు. జీ.ఐ.ఓ. ద్వారా చేయించాలి. అయితే విద్యార్థినీవిద్యార్థులతో కూడిన విద్యాసంస్థలో విద్యార్థినులను సందేశం మరియు సంస్కరణ విషయంలో దూరంగా ఉంచడం కూడా ఆచరణరీత్యా సాధ్యం కాదు. కాబట్టి అవసరానికనుగుణంగా ఇస్లామీయ హద్దుల్లో ఉంటూనే వారిలో సందేశం మరియు సంస్కరణకు సంబంధించిన కార్యకలాపాలను నిర్వహించాలి. ఒకవేళ విద్యార్థినులు మనం నిర్వహించే ఏదయినా ప్రోగ్రామ్‌లో పాలుపంచుకోదలిస్తే సాధ్యమయినంతవరకు విడిగా వారికి ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసి అనుమతించాలి.

ఒకవేళ ఏ కాలేజీలోనయినా ఎస్.ఐ.ఓ. మాత్రమే ఉండి, జీ.ఐ.ఓ. లేనట్లయితే, అవసరమైన జాగ్రత్తలు తీసుకొని విద్యార్థినుల ద్వారా జీ.ఐ.ఓ.ను స్థాపించే ప్రయత్నం చేయవచ్చు.

**ప్రశ్న:** విద్య మరియు సంస్థ మధ్య సమతుల్యతను సాధించే విషయంలో ఆచరణాత్మక వైఖరి ఎలా ఉండాలి?

**జవాబు:** ఈ విషయంలో మనం క్రింద పేర్కొనబడిన వాస్తవాలను గుర్తుంచుకోవాలి:

(1) సంస్థకు సంబంధించిన పని మన కొరకు కేవలం ఆసక్తి, వ్యాపకం లేదా టైమ్‌పాస్‌కు దోహదపడే సాధనం కాదు. ఇది మన బాధ్యతల్లో ఒక ముఖ్యమైన బాధ్యత, మన పుట్టుక లక్ష్యం. మన సాఫల్యానికి, ముక్తికి ఇది ఒక మార్గం. ఇది మన అవసరాల్లో ఒక అవసరం. ఏ విధంగానయితే మనం సమయం ఖర్చవుతుందని భావించి ఆహారపానీయాలను, స్నానం చేయడాన్ని, ఇతర ప్రాథమిక అవసరాలను లేదా నిద్రను వదులుకోలేమో అదే విధంగా సంస్థ పనిని కూడా వదలుకోలేము. సంస్థ పని విషయంలో వేరే ప్రత్యామ్నాయ మేదీ(Option) దానిని వదలిపెట్టేందుకై లేదు. కాబట్టి మనం సంస్థకు సంబంధించిన పని చేస్తూనే మన ఇతర అవసరాల కొరకు సమయాన్ని తీయాలి.

(2) పని ఎప్పుడయితే పెరుగుతుందో మానవుడు సాధారణంగా తన సామర్థ్యాన్ని ఇతోధికంగా పెంచుకుంటూ(Effeciency) పోతాడు. ఇతర విద్యార్థులతో పోల్చుకుంటే సంస్థ పని మనపై మోపబడిన అదనపు బాధ్యత అయినందున మనం గొప్ప సమర్థులుగా(Effecient) రూపొందే ప్రయత్నం చేయాలి. రోజులో వారికంటే ఎక్కువ సమయాన్ని పనిలో గడిపేవారుగా, ప్రతి గంటా వారికంటే ఎక్కువ పనిచేసేవారిగా (Per Hour Productivity) మనం రూపొందాలి.

(3) పనిభారం పెరిగినప్పుడు తట్టుకునేందుకు ఆవశ్యకమైన విషయమేమిటంటే, మానవుడు సువ్యవస్థీకృత మనోవైఖరిని కలిగియుండాలి, తనపై తాను అదుపును కలిగియుండాలి, పటిష్టమైన సంకల్పబలాన్ని (Will Power) కలిగియుండాలి, నిద్రపోవడం, మేల్కోవడం, ఇంకా ఇతర పనుల విషయంలో అతడు సమయాన్ని ఖచ్చితంగా పాటించేవాడయి (Punctual) ఉండాలి, తన పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని తాను రూపొందించుకున్న రోజువారీ దినచర్యపై అతడు స్థిరంగా ఉండాలి. ఒక డెడ్‌లైన్‌ను నిర్ణయించి దాని లోపలే పనిని ముగించే నైపుణ్యాన్ని అతడు కలిగియుండాలి.

అతడు ఈ క్రింది నియమాన్ని నిత్యం గుర్తుంచుకొని ఉండాలి:

"మనపై సంస్థ తరపు నుంచి మోపబడిన పని మనం సమయాన్ని ఎంతో జాగ్రత్తగా, పటిష్టంగా వినియోగించే అలవాటు చేసుకోవాలని కోరుతుంది."

(4) విద్యార్థి సంస్థ అయిన కారణంగా సంస్థాగత కార్యక్రమాల రూపురేఖలు విద్యార్థుల కొరకు సముచితమైన రీతిలో పటిష్టవంతంగా రూపుదిద్దబడి ఉండాలనే విషయాన్ని సంస్థ గుర్తుంచుకోవాలి. పరీక్షల సమయంలోనూ, పరీక్షలు సమీపిస్తున్న సమయంలోనూ సంస్థ

సంబంధీకులకు చదువుకోవడానికి పూర్తిగా అవకాశమివ్వాలి. అటువంటి సందర్భాల్లో ఎక్కువ వ్యవధిని కోరే కార్యక్రమాల సంఖ్యను తగ్గించాలి. మామూలు దినాల్లోనూ పని తీరు, దాని విధానాలు మరియు పరిమాణాలు విద్యార్థుల చదువులు ఆటంకపరిచే విధంగా ఉండరాదు.

ఇంతేగాకుండా మన శిక్షణా సమావేశాలు మరియు సమీక్షా సమావేశాల ద్వారా విద్యార్థులకు 'విద్య మరియు కాలేజీలలో ప్రతిభను చాటుకోవడం కూడా ఒక ముఖ్య బాధ్యత' అని బోధించాలి.

**ప్రశ్న:** విద్యాలయాల్లోనుంచి చురుకైన విద్యార్థులు విద్యాభ్యాసాన్ని ముగించుకొని వెళ్ళిపోయిన కారణంగా ఏర్పడే లోటును ఎలా పూడ్చుకోవాలి ?

**జవాబు:** విద్యాలయాల్లో పని చేసే సందర్భంలో దూరదృష్టి మరియు సరియైన అంచనాల ద్వారా లక్ష్యాలను నిర్ణయించుకోవాలి. పేర్కొనబడిన సమస్య సాధారణంగా సువ్యవస్థీకృతం కాని పనుల కారణంగా ఉత్పన్నమవుతుంది. ఎప్పటికప్పుడు క్యాడర్ పరిస్థితి ఏ విధంగా ఉందో, ఆ క్యాడర్ ఎన్ని రోజుల వరకు అందుబాటులో ఉంటుందో, ఆ క్యాడర్ వెళ్ళిపోయిన తర్వాత ఎటువంటి పరిస్థితులు ఎదురవుతాయో, అటువంటి పరిస్థితులను ఎదుర్కొనేందుకు మన వద్ద ఎటువంటి ప్రత్యామ్నాయాలు (Options) ఉన్నాయో తెలుసుకుంటూ ఉండాలి. ఇటువంటి విషయాలన్నింటి పట్ల పూర్తి అవగాహనతో కూడిన సరియైన అంచనా ఉండాలి.

విద్యాలయాల్లో పనిని స్థిరంగా రూపుదిద్దేందుకై పని సంస్కృతిని ఉత్తమంగా రూపొందించుకోవాలి. ఇందుకుగాను మొదటి సంవత్సరం విద్యార్థులపై ప్రత్యేకంగా దృష్టిని సారించి, వారి మనోవైఖరులను తీర్చిదిద్ది, వారిని సంస్థకు చేరువ చేసే విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపాలి. వారు మొదటి సంవత్సరాన్ని పూర్తి చేసుకునేలోపు పెద్ద సంఖ్యలో సంస్థతో సంబంధాన్ని ఏర్పరచుకున్న ఒక వర్గం రూపొందే విధంగా, వారిలో కొంతమంది క్యాంపస్‌లో పనికి నాయకత్వ బాధ్యతలను నిర్వర్తించగలవారుగా రూపొందేలా కృషి చేయాలి. ఆ విధంగా ప్రతి సంవత్సరం ఎస్.ఐ.ఓ.కు తక్కువ వయస్సు గల విద్యార్థుల సమూహాలు లభ్యమవుతూ ఉండాలి.

చిల్డ్రన్స్ సర్కిల్ పటిష్టత కూడా కాలేజీల్లో పనికి స్థిరత్వాన్ని ఆపాదించే ఒక ముఖ్యమైన సాధనం. విద్యార్థులకు ప్రాథమిక, నైతిక, మానసిక మరియు సంస్థాగత

శిక్షణను వారు కాలేజీలో ప్రవేశించడానికి ముందే అందించేందుకు మనం ప్రయత్నించాలి. వారు కాలేజీలోకి ప్రవేశించేటప్పటికి క్యాంపస్‌లో పని కొరకు పూర్తిగా సంసిద్ధులయ్యే విధంగా మనం వారికి శిక్షణ ఇవ్వాలి. ఈ లక్ష్యం చిల్డ్రన్స్ సర్కిల్‌ను పటిష్టవంతంగావించి నప్పుడే సాధ్యమవుతుంది. అలాగే హైస్కూల్ మరియు జూనియర్ కాలేజీ విద్యార్థుల్లో జరిగే పనికి సంబంధించిన చైతన్యవంతమైన ప్రయత్నాల ద్వారా ఈ లక్ష్యం నెరవేరుతుంది.

**ప్రశ్న:** ఇతర విద్యార్థి సంస్థల నుంచి సహాయం పొందడం మరియు వారికి సహాయాన్ని అందించడానికి సంబంధించిన సముచితమైన విధానమేమిటి?

**జవాబు:** ఈ విషయంలో క్రింద పేర్కొనబడిన అంశాలను గుర్తుంచుకోవాలి:

(1) ఒక సందేశకులుగా మనం అందరితో కలుస్తాము, అందరితో సంబంధాలు కలిగియుంటాము, అందరినీ సంబోధిస్తాము, స్నేహం మరియు సంబంధాల కొనసాగింపు విషయంలో మన వద్ద ఎటువంటి ఎంపిక విధానమూ ప్రత్యేకించి ఉండదు. మనకు మరియు ఇస్లాంకు బద్ధశత్రువులయిన వారితోనూ సంబంధాలు కలిగియుండేందుకు మనం ప్రయత్నిస్తాము.

(2) ఇంతేగాకుండా ఖుర్‌ఆన్‌లో పేర్కొనబడిన ఈ నియమం కూడా మనకు నిత్యం గుర్తుంటుంది: "తఆవనూ అలల్ బిర్రి వత్తఖ్వా వలా తఆవనూ అలల్ ఇస్మి వల్ ఉద్‌వాన్" (మంచి పనుల్లోనూ, పుణ్యకార్యాల్లోనూ సహకరించండి, పాపకార్యాల్లోనూ, అవిధేయతతో కూడియున్న పనుల్లోనూ సహకరించకండి.) మంచి పనుల్లో మనం ప్రతి ఒక్కరికీ సహకరిస్తాము మరియు సహకారాన్ని స్వీకరిస్తాము కూడా.

(3) మామూలు పరిస్థితుల్లో మన సంబంధీకులు ప్రతి మంచి పనిలోనూ వీలయినంతగా తమ సహకారాన్ని అందజేస్తారు. అయితే సంస్థ ప్రాధాన్యతలను, లక్ష్యాలను అటువంటి సందర్భాల్లో దృష్టిలో ఉంచుకుంటారు.

(4) ఏదయినా పనిలో ఒకవేళ సంస్థాగత స్థాయిలో సహకారం కోరబడుతున్నట్లయితే సహకారాన్ని అందించేముందు క్రింద తెలుపబడిన విషయాల పట్ల సంతుష్టులవ్వాలి:

⊙ సంబంధిత పని సంస్థ యొక్క వైఖరి, లక్ష్యాలు మరియు నియమాలతో ఏకీభవించే దయి ఉండాలి.

⊙ దానికొరకు స్వీకరించబడే విధానం సంస్థ యొక్క పాలసీ మరియు కార్యాచరణ విధానంతో ఏకీభవించేదయి ఉండాలి.

⊙ సహకారాన్ని కోరే కార్యం సంస్థ యొక్క ముఖ్యమైన ప్రయోజనాలకు విఘాతం కలిగించేదయి ఉండరాదు.

(5) ఒకవేళ 4వ అంశం క్రింద తెలుపబడిన విషయాల పట్ల సంతృప్తి కలిగినట్లయితే :

⊙ మనం వివిధ సంస్థలతో కలసి సంయుక్తంగా ఊరేగింపులు, నిరసన ప్రదర్శనలు మరియు తాత్కాలిక కార్యకలాపాల్లో పాలుపంచుకోవచ్చు.

⊙ ఏదయినా తాత్కాలిక పని కొరకు ఏర్పాటయిన కమిటీలో సభ్యులు కావచ్చు.

⊙ రాష్ట్రాధ్యక్షుని అనుమతితో ఒక లక్ష్యసాధన నిమిత్తం ఏర్పడిన ఉమ్మడి ఫోరమ్‌లో చేరవచ్చు.

ఈ నియమాలనే మనం సహకారాన్ని స్వీకరించే సమయంలోనూ పాటిస్తాము. ఒకవేళ మనం ఏ వ్యవహారంలోనయినా వివిధ సంస్థల నుంచి సహకారాన్ని పొందాలనుకుంటున్నట్లయితే రాష్ట్ర అధ్యక్షుని అనుమతి పొంది :

⊙ మనం సంస్థ తరఫు నుంచి సమావేశాన్ని ఏర్పాటు చేస్తాము. అందులో సంబంధిత సమస్య గురించి వివరిస్తాము.

⊙ ఆ సమస్య విషయంలో మన దృక్పథాన్ని, ఆ పని విషయంలో మన కార్యాచరణ శైలిని మనం స్పష్టం చేస్తాము.

⊙ పనికి సంబంధించిన కార్యాచరణ విధానంపై వారితో చర్చలు జరుపుతాము.

⊙ ఒకవేళ దృక్పథం మరియు కార్యాచరణ విధానంతో వారు ఏకీభవించినట్లయితే సంస్థ ఉమ్మడి ఫోరమ్‌లో చేరుతుంది.

⊙ ఒకవేళ మన లక్ష్యాలతో, ఇస్లామీయ నైజంతో లేదా మన కార్యాచరణ విధానంతో విభేదించే విషయంపై ఇతర సంస్థలు ఒత్తిడి చేసినట్లయితే అత్యుత్తమ రీతిలో మన్నింపు కోరి మనం దానినుంచి పక్కకు తొలిగిపోతాము.

ప్రశ్న: విభజనను, వేర్పాటువాదాన్ని ప్రోత్సహించే శక్తులు ఆటంకాలేర్పరిస్తే మనం ఏం చేయాలి?

**జవాబు:** విభజనను, వేర్పాటువాదాన్ని ప్రోత్సహించే శక్తులు దౌర్జన్యపూరితంగా, హింసాత్మకంగా వ్యవహరిస్తే అందుకు ప్రతిచర్యగా మనం దౌర్జన్యపూరితమైన మరియు హింసాత్మక

వైఖరిని అవలంబించము. ఖుర్ఆన్ లో పేర్కొనబడిన ఈ ఆజ్ఞ నిత్యం మన స్మృతిపథంలో మెదలుతూ ఉంటుంది: "లా తస్తవిల్ హసనతు వలస్సయ్యిఅతు ఇద్ఫఅ్ బిల్లతీ హియ అహ్సను ఫ ఇజల్లజీ బైనక వ బైనహూ అదావతున్ కఅన్నహూ వలియ్యున్ హమీమ్." (మంచి మరియు చెడు సమానం కావు. మీరు చెడును శ్రేష్ఠమైన మేలుతో అంత మొందించండి. తద్వారా మీ బద్ధశత్రువు కూడా మీ స్నేహితునిగా మారిపోయే అవకాశ ముంది.) మనం పూర్తిగా శాంతియుత విధానాల ద్వారా ఈ సమస్యను అధిగమించే ప్రయత్నం చేయాలి. అందుకుగాను క్రింద తెలుపబడిన విధానాల ద్వారా ప్రయత్నించాలి:

(1) పట్టణంలో స్తోమతగలవారిని, ప్రభావితం చేయగలవారిని కలుసుకొని వారికి సమస్య గురించి వివరించి వారి దృష్టిని సమస్య పట్ల కేంద్రీకృతం చేయాలి. కాలేజీ యాజమాన్యం దృష్టికి సమస్యను తీసుకెళ్ళి దానిని పరిష్కరించమని, సమస్యకు మూలకారకులయిన వారికి ఎటువంటి అసమంజసమైన కార్యాలకు పాల్పడేందుకు అనుమతి ఇవ్వరాదని ఒత్తిడి తేవాలి.

(2) కాలేజీ స్థాయిలో ముస్లిం మరియు ముస్లిమేతర విద్యార్థులను ఆ సమస్య విషయంలో చైతన్యవంతులను చేయాలి.

(3) సెక్యులర్ విద్యార్థి సంస్థల సహకారం ఆ సమస్య పరిష్కారం విషయంలో తీసుకోబడు తుంది. వారితో కలసి వేర్పాటువాద శక్తులను ఉమ్మడిగా ఎదుర్కోవడం జరుగుతుంది.

(4) అవసరమేర్పడినప్పుడు ముస్లిమేతర విద్యార్థులను కూడా కలుపుకొని ఇతర విద్యార్థి సంస్థలతో ఉమ్మడిగా వేర్పాటువాద శక్తుల దౌర్జన్యపూరిత కార్యకలాపాలకు వ్యతిరేకంగా చట్టపరంగా పోరాటం చేయడం జరుగుతుంది.

(5) ఈ సాధనాలన్నింటి ద్వారా మరియు ఇంకా వీలయిన ఇతర సాధనాలన్నింటి ద్వారా వేర్పాటువాద శక్తులపై ప్రభావం పడేలా కృషి చేయడం జరుగుతుంది. వాటి దౌర్జన్యపూరిత కార్యకలాపాలకు వ్యతిరేకంగా కాలేజీ విద్యార్థుల మధ్య ఏకాభిప్రాయాన్ని సాధించి అవి తమ చర్యలను విడనాడక తప్పని పరిస్థితిని సృష్టించడం జరుగుతుంది.

**ప్రశ్న:** కాలేజీ వాతావరణం అనుకూలంగా లేనట్లయితే సంస్థ పేరు తీసుకోకుండానే పని చేయవచ్చా ?

**జవాబు:** మన పనికి సంబంధించిన దశలు ఎన్నో ఉన్నాయి. ప్రాథమికంగా ముస్లిం విద్యార్థుల సర్వతోముఖ సంస్కరణ, ముస్లిమేతర విద్యార్థులకు ఇస్లామీయ సందేశాన్ని అందించడం, వారి గుణగణాలను తీర్చిదిద్దడం, విద్యార్థులకు సేవ చేయడం, వారి సమస్యలను పరిష్కరించడం మొదలయినవి క్యాంపస్‌లో పనిచేసే సమయంలో మన దృష్టిలో ఉంటాయి. అయితే ఈ పనులన్నీ ప్రభావవంతమైన రీతిలో నిర్వహించబడేందుకు సంస్థ ఉనికి మరియు దాని పటిష్టత అనేవి ఎంతో అవసరం. కాబట్టి మన మౌలిక మరియు అసలైన లక్ష్యాల సాధనతోపాటు సంస్థ తన పేరుతో సహా సంపూర్ణంగా ఉనికిని కలిగియుండేలా దానిని స్థాపించేందుకు, పటిష్టపరిచేందుకు మనం కృషి చేస్తాము.

అయితే ఆచరణాత్మకంగా కృషి చేసేవారందరి వలె అనుకూలంగా లేని వాతావరణంలో మన లక్ష్యాలన్నీ నెరవేరడం మరియు మన విభాగాలన్నీ పనిచేయడమనేది పూర్తి కావనే విషయాన్ని మనం గుర్తుంచుకొని ఏ లక్ష్యం నెరవేరడానికి అవకాశముందో ఆ లక్ష్యసాధన కొరకు పనిచేస్తాము.

ఈ క్రమంలో ఒకవేళ సంస్థ పేరుతో పనిచేయడం వల్ల ఒకవేళ సంస్థ పని నెరవేరకపోవడమే కాకుండా సందేశం మరియు సంస్కరణలకు సంబంధించిన లక్ష్యాలు నెరవేరకపోయే ప్రమాదమున్నప్పుడు మనం వివేకంతో వ్యవహరించి కొంతకాలం వరకు సంస్థ పేరును వినియోగించుకోకుండానే క్యాంపస్‌లో పనిచేస్తాము.

అయితే పరిస్థితులను మనకు అనుకూలంగా మలుచుకొని సంస్థకు చెందిన అన్ని విభాగాల పనులూ నిర్వహించబడేందుకు, సంస్థను నెలకొల్పి దానిని పటిష్టపరిచేందుకు మనం నిత్యం ప్రయత్నిస్తాము.

**ప్రశ్న:** ఒకవేళ కాలేజీలో ఇతర ముస్లిం సంస్థలు కూడా పనిచేస్తున్నట్లయితే వాటితో సంబంధాలను ఏర్పరచుకునే విధానమేమిటి?

**జవాబు:** సాధారణ ముస్లిం సంస్థల విషయంలోనూ మన వైఖరి పవిత్ర ఖుర్‌ఆన్ లో పేర్కొనబడిన **"తఆవనూ అలల్ బిర్రి వత్తఖ్వా వలా తఆవనూ అలల్ ఇస్‌మి వల్ ఉద్‌వాన్" (మంచి పనుల్లోనూ, పుణ్యకార్యాల్లోనూ సహకరించండి, పాపకార్యాల్లోనూ, అవిధేయతతో కూడియున్న పనుల్లోనూ సహకరించకండి)** అనే వాక్యంలో ఉన్న నియమం ప్రకారమే ఉంటుంది. మనం ప్రతి ముస్లిం సంస్థతోనూ సంబంధాలను కలిగియుంటాము. మనం వారిని మనకు పోటీదారులుగా, ప్రత్యర్థులుగా భావించము. పైగా వారిని మనకు

సహకారమందించేవారుగా భావిస్తూ వారి పనిలో కూడా మన కొరకు అవకాశాలను అన్వేషిస్తాము. వారిని గౌరవిస్తాము. వారితో విభేదాన్ని కేవలం వైజ్ఞానిక హద్దుల్లోనే కలిగియుంటాము. ఉమ్మడి కార్యకలాపాల్లో వారి సహకారాన్ని తీసుకుంటాము, వారికి సహకారమందిస్తాము కూడా. ఈ విషయంలో కొన్ని సూత్రప్రాయమైన అంశాలు క్రింద పేర్కొనబడుతున్నాయి:

(1) ఇతరుల అభిప్రాయాలతో విభేదిస్తాము. కానీ ఉపద్రవాలను రేకెత్తించము. నియమాలుమరియు సిద్ధాంతాల విషయంలో, ఇతర అంశాల్లో, వ్యవహారాల్లో చర్చించడం, ఆరోగ్య కరమైన రీతిలో విభేదించడం తప్పు కాదు. కానీ నియమాలు మరియు సిద్ధాంతాలకు బదులు వ్యక్తిత్వాలు మరియు వ్యక్తికి సంబంధించిన వ్యవహారాలు చర్చించబడినప్పుడు, చర్చలకు బదులు మొండివాదనలు చోటుచేసు కున్నప్పుడు, ఆరోపణలు మరియు ప్రత్యారోపణలు శరపరంపరగా కొనసాగినప్పుడు, ఒకరినొకరు దిగజార్చుకునే ప్రయత్నాలు కొనసాగినప్పుడు, ఇతరుల ప్రభావాలను తగ్గించేందుకు ఇరువర్గాలూ ప్రయత్నించినప్పుడు విభేదాలు తీవ్రరూపం దాల్చి గొడవలకు దారితీస్తాయి. అయితే మనం ఇటువంటి సంస్కారహీన మయిన పద్ధతులన్నింటికీ దూరంగా ఉంటాము.

(2) ఒకవేళ ఇతర విద్యార్థి సంస్థల తరపు నుంచి నీచమైన పద్ధతుల్లో వ్యతిరేకత ఎదురయి నప్పటికీ మనం పవిత్ర ఖుర్ఆన్‌లో పేర్కొనబడిన **'ఇద్‌ఫఅ్ బిల్లతీ హియ అహ్‌సను'** అనే వాక్యానికి అనుగుణంగా నడచుకుంటాము. మనల్ని మనం రక్షించు కుంటాము, ప్రతిస్పందిస్తాము. కానీ ప్రతిచర్య కొరకు నీచమైన పద్ధతులను మనం ఎంతమాత్రం అవలంబించము.

(3) మనం విద్యార్థుల్లో వివిధ ఇస్లామీయ ధార్మిక సమూహాల (జమాఅత్‌లు) మధ్య అనారోగ్యకరమైన పోటీని నిరుత్సాహపరుస్తాము. అటువంటి విషయాల వల్ల విద్యార్థులు తికమకకులోనయి అన్నిరకాల ధార్మిక వర్గాలకూ దూరమయిపోయే ప్రమాదముంది. ఎన్నో ప్రాంతాల్లో ఈ విషయం గమనించబడింది. ఒక విద్యార్థి వద్దకు ఉదయం ఒక జమాఅత్ వస్తే, సాయంత్రం మరొక జమాఅత్ వస్తుంది. అటువంటి పరిస్థితిలో విద్యార్థిపై ప్రతి జమాఅత్‌కు సంబంధించిన ఒత్తిడి ఏర్పడుతుంది. చివరకు అతడు అన్ని జమాఅత్‌ల పట్లా నిరాసక్తుడై అన్నింటికీ

